3 8 8 2 3

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము. ౧౫.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)



O35,1H65,1
F36

శ్రీనాథ మహాకవి.

A. 83.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకటితము. ౧౫.

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

మహాకవి శ్రీనాథప్రణీతము.

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికనుండి పునర్ముద్రితము.

మొదటికూర్పు 500 ప్రతులు.

C. M. V. Sharma
Nalgonda

చెన్నపురము:

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

బ్రిటిష్ మాడెల్ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె.

౧౯౨3.

వెల, ౧౨ అణాలు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

# పీఠిక.

శ్రీనాథమహాకవి కాశీఖండమునందు "చిన్నారిపొన్నారి" యనుసీసపద్యమునఁ దాను రచించిన శాలివాహనసప్తశతి, మరుత్తరాట్చరితము, భీమఖండము, నైషధము, కాశీఖండములను లోకమున కెఱుకపఱిచెను. అందలి మొదటిరెండుగ్రంథములు నింతవఱకు నెవ్వరికిని గోచరములు కాలేదు. ఆపద్యమందు లేని హరవిలాస మిపుడు ముద్రితమై ప్రచారమున నున్నది. దంతులూరి బాపరాజు మూర్తిత్రయోపాఖ్యాన పీఠికలోఁ దనతాత యగుగన్నరపతి "శ్రీనాథసుకవీంద్రుచే ధనంజయవిజయం బను సత్కావ్య మందికొనియె" నని చెప్పినాఁడు. దానింబట్టి కవిసార్వభౌముఁడు కిరాతార్జునీయమును గూడ రచించె నని యూహింపనగును. ఇవియే కాక యెన్నఁడు నెవరును గని విని యెఱుంగనిది యీశివరాత్రిమాహాత్మ్య మొకటి.

దీనిని గొంత కాలమునకు మునుపు ఆంధ్రసాహిత్యపరిషత్తువారు తమ ప్రాచ్యలిఖితగ్రంథపరిశోధనమునఁ గృష్ణాజిల్లా నందిగామ తాలూకా జొన్నలగడ్డ వాసిరెడ్డి వారియింటఁ గనుఁగొని యావృత్తాంతము లోకమున కెఱుకపఱిచి ప్రత్యంతరమునకై చాలఁ బ్రయత్నించియు నయ్యది లభింపమిచే నెట్లో పత్రికలోఁ బ్రకటించిరి. ఈ గ్రంథమును బలువు రపేక్షించుటచే మరల నిపుడు పుస్తకరూపమునఁ బ్రకటింపఁబడుచున్నది. కావున దీనిచరిత్ర మిటఁ గొంచెము చర్చింపఁబడును.

ఈగ్రంథము ప్రతి యతిశిథిలము లగుతాటియాకులపైఁ గలదు. మధ్యమధ్య పత్రములును ముక్కలు నుసినుసియై పోవుచున్నవి. వ్రాఁత చాలఁబురాతన మైనది. ఆనందనామసంవత్సర శ్రావణశుద్ధ ౧౩ మంగళవారమునాఁడు వెంక్కన కుల్కరణి మ॥ గుడిమిట్ల వ్రాసినట్లు ద్వితీయాశ్వాసముచివర నున్నది. ఈయానంద క్రీ. శ. 1674 నాఁటిది కావున నిప్పటికి 249 యేండ్లక్రిందటివ్రాఁత. ఈగుడిమిట్ల నందిగామ సమీపమున నున్నది. గుండ్రని నైజాముకత్తు. సాధారణముగాఁ దాటాకుపుస్తకములు చదువువా రెల్ల నీవ్రాఁత చదువఁజాలరు. ప్రస్తుతము లభించినగ్రంథము నాలుగాశ్వాసములది. దీనితోఁ గవి మొదటఁ బ్రతిజ్ఞ చేసిన "ఉరులింగోద్భవంబును, శివరాత్రిమాహాత్మ్యంబు" నను కథలు ముగిసిపోయినవి. కాని నాలవయాశ్వాసాంతమున శివదూతలచే యమదూతలు పరాజితులై యముని కెఱిఁగింప "చిన్నఁబోయియముండేమి చేసె" నని యైదవయాశ్వాసారంభ సూచకముగ మునులచేఁ బ్రశ్నింపఁబడెను. దానిచే నింకను గొంతగ్రంథము కలదేమో యని తోఁచును.. కాని శ్రీనాథకవి యింత మాత్రమే రచించె ననుట సమంజసముగా నున్నది. ఏలన మొదటఁ బ్రతిజ్ఞ చేసిన శివరాత్రిమాహాత్మ్యము ముగిసినది. పైని యమప్రమథాదులయుద్ధములు కథ కంత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా నుపకరించునవి గావు. కావున మూల మగునీశానసంహితాధ్యాయాంత్య పద్యానురోధమున నీమునులప్రశ్నవాక్యమును గూడ గ్రంథమందుఁ జొప్పించె ననుట యుత్తమము. [1] రెండవది శ్రీనాథుఁ డీ గ్రంథమును ముగింపకమునుపే కాలగతి నొందుట వలన నాలుగాశ్వాసములు మాత్రమే శ్రీనాథరచితములని చెప్పవలయును. అంతియకాని యింకను గొంతభాగమున్న దనియు నది లేఖకునిచే విడువఁ బడిన దనియుఁ జెప్పు టంతసరికాదు, కావున శివరాత్రిమాహాత్మ్యము సమగ్రముగనే లభించిన దని తలంపనగును. ఇఁక నీగ్రంథ మేకాలమున రచింపఁబడెనో విమర్శింపవలసి యున్నది.

"సత్కవిసార్వభౌముం డగుశ్రీనాథకవివరేణ్యు - - - గాంచి "ఆ. ౧. ప. ౧౩.

గీ. వేడ్కఁ గవిసార్వభౌముని విమలచరితు "ఆ. ౧. ప. ౩౭.

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్యపౌత్రుండును మారయామాత్యపుత్రుండును నగుశ్రీనాథకవివరేణ్యుండు సంతుష్టమానసుండై. ఆ.౧.ప.౩౮

అనువాక్యములవలనను, ఆశ్వాసాంతగద్యములు నాలుగువలనను శ్రీనాథుఁడు కవిసార్వభౌమబిరుద మందినపిదప హరవిలాసనైషధములకుఁ బిదప భీమఖండమునకు మునుపు దీనిని రచించె నని శ్రీవీరేశలింగముపంతులుగారియూహ. ఈగ్రంథమందు దోషము లత్యధికముగా నుండుటచే నియ్యది శ్రీనాథునిబాల్యకవిత యని బ్ర॥ శ్రీ॥ నాగపూఁడి కుప్పుస్వామయ్యగారి తలంపు. వీ రిరువురివాదములలో నేది వాస్తవమో పరికింతము.

"సుతుని స్న్నద్వ్యక్తశాంతాత్మునిన్. ఆ. ౧. ప. ౧.

"ఆలిని బుక్కటందిడి. ఆ. ౧. ప. ౩.

"కృతిపతు లగుకవిముఖ్యుల. ఆ. ౧. ప. ౯.

"వడిప్రాసవిడంబబంధమ్మై. ఆ. ౧. ప. ౧౧.

"మల్లికార్జునకుత్పలంబర్థిఁబడసె. ఆ. ౧. ప. ౧౬..

"పుణ్యఋషీశ్వరసప్తతుల్యులం బోలిన. ఆ. ౧. ప. ౧౯.

"వైభవప్రఖ్యాతవరహరిశ్చంద్రుండు. ఆ. ౧. ప. ౨౦.

"ఘనుఁడు కొమరగిరీంద్రుండు గలిగి యుండు. ఆ. ౧. ప. ౨౦.

"నేర్పరతుఁడు. ఆ. ౧. ప. ౨౨.

"(సకలసద్గుణ)విఖ్యాసారసాఖ్యమహితపంచాక్షరీమంత్రమానసాత్మ ఆ. ౧. ప. ౨౮.

"పరమపాతివ్రత్యభావంబు తలఁపంగ గౌరిగాఁబోలునీ కాంత తలఁప. ఆ.౧.ప.౩౮.

---

[1] ఈయుక్తికి ముందు విమర్శింపఁబోవు ప్రమాణము లాధారములు.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

"నల్విటుచింత." ఆ. ౧. ప. ౫౬

"కాకోదరగ్రామణీకంఠగ్రైవేయు. ఆ. ౧. ప. ౫౮.

ఇట్టివేకాక యింక ననేకదోషములును నప్రౌఢకవితాబంధమును నవతారికా భాగమున నగపడుచుండుటచే నీగ్రంథము శ్రీనాథరచితము కా దనియైనను బాల్యరచిత మని యైనను జెప్పనగును గాన శ్రీవీరేశలింగముపంతులుగారి యూహ సరికాదు. గ్రంథమునందుఁ బలుతావులఁ గవిసార్వభౌమబిరుద ముండుటచేతను దోషము లవతారికాభాగమందె తక్క మఱెచ్చటను లేకుండుటయే కాక కథాభాగము శ్రీనాథుని యితరగ్రంథములశైలికి సమాన మగుప్రౌఢిచే నలరారుచుండుటచేతను శ్రీకుప్పుస్వామయ్యగారి తలంపుకూడ సరికాదు. ఇఁక మూఁడవపక్ష మొకటి స్ఫురించినది. దానిని జిత్తగింపఁ బ్రార్థించెద.

శ్రీనాథుఁడు నైషధరచనానంతరము ప్రౌఢదేవరాయల యాస్థానపండితుఁ డగు గౌడడిండిమభట్టు నోడించి సార్వభౌమబిరుద మందెను. ఆబిరుద మీగ్రంథమునఁ గలదు గదా? హరవిలాసనైషధములందు లేనిపంచారామాప్సరఃకురంగేశ్వరుల నామములు తొలుగొల్ల భీమఖండమున నుపయోగింపఁబడినవి. ఆనామము లీగ్రంథమందు నగపడుచున్నవి. కావున శివరాత్రిమాహాత్మ్యము భీమఖండమునకుఁ బిదపనే రచింపఁబడినది. ఇంతే కాక సంస్కృతకాశీఖండమునుండి గుణనిధిచరిత్రములోని వగు

శ్లో॥ "యాయజూకకులే జన్మ క్వ క్వ మే వ్యసనం మహత్
అహో బలీయా న్నవిధి ర్భావికర్మానుసాధయేత్
భిక్షితుం నాధిగచ్ఛామి నమే పరిచితః క్వచిత్
నచహస్తే ధనం కించి త్కిమత్ర శరణం భవేత్
సదా హ్యభ్యుదితే భానౌ ప్రసూర్మే మృష్టభోజనమ్
దద్యా దద్యాత్ర కం యాచే యాచే హా జననీ నమే"

అనుశ్లోకములను

గీ. అక్కటకట దురోదరవ్యసన మెట్లు, యాయజూకవిశిష్టాన్వవాయ మెట్లు
ఎట్లుచేసినఁ జేయుఁగా కే మనంగ, నేర్చువారము విధి దయానిస్స్వహృదయి
కా. ఆ. ౪. ప. ౧౧౩.

చ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం బొడతేర గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిందెలునుం గుడువంగఁబెట్టు ని
ర్భరకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లియున్నదే
హరహర యెవ్వరింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్. ఆ. ౪. ప. ౧౧౪.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

అనుపద్యములుగా నాంధ్రీకరించెను. ఇందు మొదటిపద్యమును విస్తరించి శివరాత్రిమాహాత్మ్యమున వర్ణించినాఁడు. రెండవదాని నేమాత్రమును మార్పుసేయక యట్లే వేసినాఁడు. (చూ. ఆ 3 ప ౧౯.) ఈమూలశ్లోకములు కాశీఖండమందు నీశానసంహితయందు నొకగీతినే యుండునా? ఈశానసంహిత యెందున్నదో యగపడదు. కాశీఖండమే యీశానసంహిత యనినఁ దప్పుకాఁజాలదు. కావున నీగ్రంథము కాశీఖండము గూడ రచించినపిమ్మట నే ౧౪౪౦ ప్రాంతమున రచింపఁబడె నని నానిశ్చయము. అయినచో నవతారికాభాగమందలి యప్రౌఢశైలికి నలాక్షణికప్రయోగములకును గతి యేమందురా? శ్రీనాథుఁడు కాశీఖండమునందుఁ గుబేరపూర్వవృత్తకథనావసరమున శివరాత్రిమాహాత్మ్యమును గుణనిధిచరిత్రరూపమున వర్ణించెను. తనగ్రంథములం దటనట బాణకాదంబరిలోని వాక్యముల నుపయోగించెఁ గాని యీ రెంటియందును దనివిసనక కాదంబరిలోని రసవంతము లగుభాగముల విరివిగ గ్రహించి సుకుమారచరిత్రమును గల్పించి శివరాత్రిమాహాత్మ్యమును సమగ్రముగ వర్ణించెను. గ్రంథము పూర్తి చేసి యవతరణిక రచింపకమునుపే కైలాసమున కేగెను. పిదప శ్రీశైలవాసియగు శాంతయ యెట్లో యీయేకలిఖితప్రతిని సంపాదించి కొంతధనము వెచ్చించియో లేకయో స్వయముగనో లేక తనయాశ్రితుఁడగు నొకయప్రౌఢకవివలననో యుపోద్ఘాతము నువ్వవింపఁజేసి జనకవియుక్తమై నిరాలంబమైనయీకృతికన్యను దనకంటఁగట్టుకొనియె నని యూహించుట సాహసము కానేరదు. గ్రంథారంభమునందలి యిష్టదేవతాస్తుతియుఁ గవిస్తుతియుఁ గృతిపతి కృతికర్త నుద్దేశించి పలికినవాక్యములును గవిప్రతిజ్ఞావాక్యములందలి ప్రథమపురుషప్రయోగమును, వేయేల సకలవిధదోషాకరంబైనయవతారికయెల్లను శ్రీనాథుని యితరసర్వగ్రంథములకు భిన్నమార్గము గలదై పైసిద్ధాంతమును బోషించుచున్నది. కావున నిందలి,యవతారిక శ్రీనాథవిరచితము కా దనియుఁ గథాభాగము నాలుగాశ్వాసములు మాత్రము కాశీఖండానంతరము ౧౪౪౦ ప్రాంతమున శ్రీనాథుని చరమదశయందు రచింపఁబడె ననియు నీగ్రంథమందలి కథానాయకునితోడనే శ్రీనాథుఁడును బ్రమథపదవి నందె ననియు నీకృతియే శ్రీనాథునియంత్యకృతి యనియు (దీనికంటె నర్వాచీనకృతి కనఁబడువఱకు) నూహింపవచ్చును.

ఇఁక నీగ్రంథరచనమందలి కొన్ని విశేషములు.

గీ. వానిఁ గలలోనఁ గానని వనజముఖియు, వాని మార్పునఁ బోల్చని మానవతియు
వానిగా నాత్మభావించి పరుని గవయ, నప్పళింపనిసతియు లేదయ్యె నచట.

శృం. నై. ఆ. ౧. ప. ౬౦.

అనుపద్యమును విస్తరముగా రసవత్తమముగా శివరాత్రిమాహాత్మ్యమున

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. హృదయ మువ్విళ్లూర నేకాంతమునసుండి వానిఁజింతింపనివనజముఖియు
నొకమాఱతనిఁజూచియొండొక్కమాఱుఁజూడనభిలషింపనివిద్రుమాధరియును
గలలోనవానిఁజిక్కఁగఁగౌఁగిటనుజేర్చిముకుళితేక్షణగానిముద్దియయును
నతనిరూపంబుగుడ్యంబులందులిఖించియందంబుఁజూడనియంగనయును
జెలులచేతనుబ్రోదిరాచిలుకచేత, వానిగుణములువినికుచద్వంద్వసీమఁ
బాదుకోఁబులకింపనిపైఁదలియును, బన్నిదముప్రేసినను లేదుపట్టనమున.

ఆ. ౨. ప. ౯౪.

అనుసీసపద్యముగా రచించెను. ఇంక నిట్టి వనేకము లాతనిపూర్వగ్రంథానుకర
ణము లిందుఁ గలవు.

గ. తస్యరాజ్ఞో నిఖిలకలాకలాపావగాహనగభీరబుద్ధిః - - - - బృహస్పతి రివ సునా
శీరస్య కవి రివ వృషపర్వణః వసిష్ఠ ఇవ దశరథస్య, విశ్వామిత్ర ఇవ రామస్య,
ధౌమ్య ఇ వాజాతశత్రోః, దమనక ఇవ భీమస్య, సుమతి రివ నలస్య, సర్వకార్యే
ష్వప్రతిహతమతిరమాత్యోబ్రాహ్మణఃశుకనాసో నామాభవత్. కాదంబరి గ.౨౪౩

వ. ఆరాజునకు నిఖిలశాస్త్రకలాపావగాహనగంభీరబుద్ధి యజ్ఞదత్తుం డనుబ్రాహ్మ
ణుండు దేవేంద్రునకు బృహస్పతియు, వృషపర్వునకు శుక్రుండును దశరథునకువసి
ష్ఠుండును రామునకు విశ్వామిత్రుండును నజాతశత్రునకు ధౌమ్యుండును నలు
నకు దమనుండునుం బోలెఁ బ్రధానియై" శివరాత్రి. ఆ. ౨. ప. ౧౫.

గ. సత్యపి రూపవిలాసోపహసితరతివిభ్రమే లావణ్యవతి వినయవ త్యన్వయవతి హృద
యహారిణి చావరోధజనే" కాదంబరీ. గ. ౧౨.

వ. అమ్మంత్రిభార్యవినయవతి వివేకవతి విభ్రమవతి విలాసవతి సౌభాగ్యవతి లక్షణవతి
యౌదార్యవతి గాంభీర్యవతి యన - - - శివరాత్రి. ఆ. ౨. ప. ౧. ౧౫. - - - -

పైగద్యమునందలి సప్తమ్యంతములను జమత్కారముగఁ బ్రథమాంతములుగ
మార్చినాఁడు. మూలమందలి రాజాంతఃపురము నాంధ్రీకరణమున మంత్రిభార్యగా
నొనర్చెను.

గ. ఏకంతు తనయముఖకమలదర్శనసుఖంతు న లేభే తథా సంభుజ్యమానమపి నిష్ఫల
పుష్పదర్శనం శరవణ మి వాంతఃపుర మభవత్. కాదంబరీ. ౨౭౧. ౨౭౨.

గీ. తనయసంతానలబ్ధి చేదవ్వగాఁగ, విభవసంపత్తి గల్గియు విన్నఁబోయి, వనితనిష్ఫల
పుష్పదర్శనముఁ దాల్చె, శరలతా కాననమువోలె జవ్వనంబు.శివ. ఆ. ౨. ప. ౧౭.

గ. అథ తస్యా స్తాంబూలకరంకవాహినీ సతతప్రత్యాసన్నా మకరికానామ రాజాన
మువాచ॥కాదంబరీ. ౨౮౩.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గ. ప్రథమమపి స్వామినీదానవశ్రీరివ సతతనిందితసురతా శయనాసనస్నానభోజనభూ షణపరిగ్రహాదిషు సముచితేషు దివసవ్యాపారేషు కథంకథ మపి పరిజనప్రయత్నా త్ప్రవర్తమానా సశోకే వాసీత్॥ కా. గ. ౨౯౬.

గ. దేన హృదయపీడాపరిజిహీర్షయాచ నదర్శితవతీ సా వికారమ్. కా. గ. ౨౯౭.

గ. అద్యతు చతుర్దశీతి భగవంతం మహాకాల మర్చితు మితోగతయా తత్రమహాభారతే వాచ్యమానే శ్రుతం అపుత్రాణాం కిల గతి ర్నాస్తి నవా సంతి లోకాః. కా. గ. ౨౯౮.

వ. ఈదుఃఖంబునకుఁ గారణం బేమని యడుగుటయుం బ్రత్యుత్తరం బీక యూరకున్న దాని తాంబూలకరంకవాహినియిట్లను. అను ౨. ఆ. ౩౦. వచనముగా.

గ. అపరేతు - - - - ప్రతారణకుశలై ర్ధూర్తై రమానుషోచితాభి స్తుతిభిః ప్రతార్యమాణా విత్తమదమత్తచిత్తా నిశ్చేతనతయా తథేత్యాత్మ న్యారోపితా లీకాభిమానినా - - - - అంతః ప్రవిష్టారభుజద్వయమివాత్మబాహుయుగళం సం భావయంతి. గ. ౭౧౫. ౧౬

గ. దర్శనప్రదానమ ప్యనుగ్రహం గణయన్తి. ౭౧౮.

గ. దృష్టిపాతము ప్యుపకారపక్షే స్థాపయన్తి. ౭౧౯.

గ. సంభాషణ మపి సంవిభాగమధ్యే కుర్వన్తి. ౭౨౦.

గ. ఆజ్ఞా మపి వరప్రదానం మన్యన్తే. ౭౨౧.

గీ. తమ్మమానుష కాలోచితంబులైన, కీర్తనంబుల మై పులకించుకొండ్రు
తారమర్త్యులుగా మదిఁదలఁతురహహా, విత్తమదమత్తచిత్తులై వెఱ్ఱిజనులు.
శివ. ౨. ఆ. ౯౪ ప.

సీ. అయ్యనీవుచతుర్భుజావతారుఁడ వన్న - - - - ౯౭.

గ. మిథ్యామాహాత్మ్యగర్వనిర్భరాశ్చ నప్రణమంతి దేవతాభ్యః కించ నపూజయన్తి ద్విజాతీ న్నమానయన్తి మాన్యా న్నార్చయంత్యర్చనీయా న్నాభివాదయం త్యభివాదనార్హా న్నాభ్యుత్తిష్ఠంతి గురూన్. గ. ౭౨౨. ౨౩. ౨౪.

ఉ. సంపదపేరికట్టిఁడిపిశాచముసోఁకినమానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జనులైనవారి మ
న్నింపఁడు మిత్రబంధుల గణింపఁడుధర్మరహస్యము ల్విచా
రింపఁడుమీ - - భరింపఁడహంకరణంబు పెంపునన్. శివ. ఆ. ౨. ప. ౯౮.

గ. ప్రవిశ్యచ తరుషండస్య మధ్యభాగే మణిదర్పణమివ త్రైలోక్యలక్ష్మ్యాః స్ఫటికభూమి గృహ మివ వసుంధరాదేవ్యాః కైలాసమివద్ర వతామాపన్నం - - - చంద్రాతప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మివ రసతా ముపేతం హారాట్టహాసమివ జలీభూతమ్ - - - - శరదభ్రబృంద మివ ద్రవీభూయైకత్ర నిష్యందితమ్ అచ్ఛోదం నామసరో దృష్టవాన్. గ. ౮౩౬.

సీ॥ ''స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి - - - -
శివ. ౩. ఆ. ప. ౨౧.

ఇట్టియుదాహరణముల నింక ననేకములుగాఁ జూడనగును. వేయేల ''తప్పు మానుష'' ''అయ్యనీవు'' ''సంపదపేరి'' అనుపద్యముల కీగ్రంథమునం దేప్రసక్తియు లేకున్నను గాదంబరీరసాస్వాదపరవశత్వముననే యాంధ్రీకరించె నన్నచో శ్రీనాథకవి కాదంబరి నాంధ్రీకరించుతలంపుననే శివరాత్రిమాహాత్మ్యరచన మారంభించె నని యును, గాశీఖండమునందలి గుణనిధిదుర్గుణవర్ణనమునను శివరాత్రివ్రతప్రభావవర్ణనము నను దనివిసనక సుకుమారచరిత్రమును గల్పించె ననియును విశద మగును గదా?

పైని జెప్పిన విశేషములంబట్టి యీగ్రంథ ముత్తమప్రబంధములలో నొకటియేఁ బవిత్రగ్రంథములలో నొకటియు ననియుఁ దెలియనగును. ఈగ్రంథ మింతకాలము తాళపత్రములలో ఘుణాక్షరబహుళముగ నింతదనుక (౪౦౦ సంవత్సరములు) ఏరికి నగపడకున్నను నేఁటి కాంధ్రసాహిత్యపరిషత్తువారి యమోఘపరిశ్రమమువలన నాంధ్రలోకమునకుఁ బ్రత్యక్ష మగుట మహాదృష్టవిశేషమే. ఈగ్రంథమును దొలుసారి పత్రికలోఁ బ్రకటించుసమయమున, గీర్తిశేషు లగుశ్రీతంజనగరం దేవరాజసుధిగారు చాలసాయ మొనరించిరి. దీనిని సంస్కరించుటయందుఁ గాదంబరియును శ్రీనాథుని యితరగ్రంథము లన్నియును సహాయము లైనవి. అయిన నింకను గ్రంథపాతములును దోషములు సందేహములు ననేకము లుండిపోయినవి.

ఇట్లే యింక నితరుల కనేకసంస్కరణములు దోఁపవచ్చును. అవియెల్లఁ దృతీయముద్రణమున గ్రహింపఁబడును.

ఇట్లు, బుధవిధేయుఁడు,

కట్టి సాంబమూర్తిశాస్త్రి.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

## సవరణలు.

| పుట. | బంతి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 7 | 18 | బ్రహ్మోకైవర్త | బ్రహ్మాకైవర్త |
| 9 | 21 | సముద్ధిత | సముత్థిత. |
| 11 | 2 | ప్రతిస్పృద్భయ | ప్రతిశ్రుద్భయ |
| 32 | 26 | మిన్నకున్నా | మిన్నకున్నాఁ |
| 34 | 30 | పద్యమునాల్గవచరణము | యతి (?) |
| 35 | 9 | నకుల- | నకులి-(మూ) |
| 43 | 30 | ఈచరణములో | యతి (?) |
| 48 | | నమదకాంతార | సమదకాంతా |
| 50 | 9 | పెనుజలి | పెనుఁజలి |

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

ప్రథమాశ్వాసము.

C. M. V. Sharma
Nalgonda

---

### ఇష్టదేవతాప్రార్థనాదికము.

శా. శ్రీ - - - - - వాశ్రితోరక్షనలీ
నాగాధీశవిశిష్టసంస్తవలసన్నాళీకపాదద్వయ
ప్రాగల్భ్యుం డగుశంకరుండు మనుచుం బ్రత్యక్షుమై యెప్పుడున్
యోగీంద్రాఖ్యుని ముమ్మడీంద్రసుతుని న్నుద్యుక్తశాంతాత్మునిన్. ౧

శా. శ్రీరామారమణుం డశేషజగతీక్షేమంకరప్రక్రియా
ధారాయత్తమనస్కుఁ డార్యజనసంభావ్యుండు భవ్యాత్ముఁ డై
గారామారఁగ నుమ్మమాంబికసుతున్ గౌరీశభక్తాగ్రణిన్
ధీరు న్ముమ్మయశాంతుని న్ననుచు సందీర్ఘాయురర్థాఢ్యుఁ గన్. ౨

ఉ. నాలుగుమోములం దనర నాలుగువేదము లభ్యసించుచున్
నాలుగునైదురూపముల నవ్యసుఖ - - చేసియున్
ఆలిని బుక్కిటం దిడి విహాయసవీథిని నంచ నెక్కి తాఁ
జాలఁ జరించుబ్రహ్మ ఘనశాంతుఁడు శాంతనఁ బ్రోచుఁగావుతన్. ౩

చ. హరిహరపద్మజాదు లగునాద్యులు సంతతభక్తియుక్తు లై
చిర మగునిష్టసంపదలఁ జేకొని లోకములన్ సృజింపఁగా
నరుదుగఁ బ్రేమఁ బ్రోవ లయ మందఁగఁ జేయఁగఁ గర్త లైరి నీ
పరమహనీయతత్త్వ మనివార్యము సద్గుణశీల పార్వతీ. ౪

గీ. మదనుఁ గన్నతల్లి మాధవునిల్లాలు, బ్రతుకు లెల్లఁ దానె పట్టిచూడ
ముఖ్య మైనలక్ష్మి ముమ్మయశాంతాత్ము, మందిరంబునందు మనలుచుండు. ౫

చ. కవి కవితాబ్ధిలోన ముఖగహ్వర మోడయు జిహ్వ త్రెడ్డు హృ
త్పవనుఁడు పీలికాఁడు మృదుభాషలు రత్నము - - -
- - మాత్రవర్తకునికైవశి నీకు విశేషసత్కృతుల్
గవయఁగ నిచ్చె నీవలనఁ గావ్యసుఖస్థితి యిచ్చుఁగావుతన్. ౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. బాణు సద్భుతశాస్త్రబహుకలాపారీణుఁ బ్రకటవరకవితా - - -
- - - - గాంభీర్యబంధానుబంధవిస్ఫురితమహోన్నతిస్తోము సోముఁ
జిరతరమతిభద్రుఁ జెన్నారిశివభద్రు సతులగుణస్ఫారు నమ్మయూరు
వరనీతిచాతురీవాగ్భూతి భవభూతి - - - - మోఘు మాఘు
ఘనవినూత్నవికాసు శ్రీకాలిదాసు, దండికావ్యానులాపవాగ్దండి దండిఁ
జిత్రవాగ్జృంభణప్రఖ్యుఁ జిత్తపాఖ్యుఁ, దగిలి మలహణు బిలహణు - - ౭
ఉ. ఉన్నత మైనయాంధ్రకవితోక్తుల నెంతయుఁ బ్రౌఢ లైన యా
నన్నయభట్టు తిక్కకవినాయకుఁ డెఱ్ఱనశంభుదాసు - - - - -
- - - - - - - - - -
- - శాస్త్రముల సంఘట - - కన్. ౮
క. కృతిపతు లగుకవిముఖ్యుల, సతతముఁ గొనియాడి వారిసన్నుతి - - -
- - - - - - - - - - - ౯
క. - - కోటుల, తెలఁగిదె యని తప్పు లెల్లఁ దీస్తురు వశు లై
మెలఁగరు సుకవులఁ గుకవులు, కలకులు వలుకుటయ నేర్పు గర్వప్రౌఢిన్. ౧౦
ఉ. పద్యగణాక్షరప్రకరభావరసార్థగుణా - - -
- - శబ్దపదహేతుకలారసపత్త్రియాఢ్య మై
యాద్యులు చన్నమార్గమున నావడిప్రాసవిడంబబంధ మై
చోద్యము గాఁగఁ జెప్పుకృతి శ్రోత్రసుఖావహ మెల్లచోటులన్. ౧౧
శా. - - - సంభూతకస్థాన మై
ఖ్యాతం బై బుధహృద్యమంగళకవీంద్రాచార్యసంసేవ్య మై
యాతారార్కసుధాంశు నై కమలజాతాకల్ప మై యెప్పుడున్
జ్యోతిశ్చక్రముఁ బోలెఁ గ్రాలనలదా సొం - - - ౧౨
వ. అని యిష్టదేవతాప్రార్థనంబును గురుప్రశంసయుఁ గవీశ్వరప్రస్తుతియుఁ గుకవి
నిరాకరణంబును, జేసి యొక్కకవితావిధానంబు శైవంబుగా సుకుమారచరిత్రంబు
- శివస్వస్తి శ్రీపర్వత శ్రీస్వయంభూ శ్రీలింగచక్రవర్తి శ్రీమన్మల్లికార్జున శ్రీమహా
దేవుని ముఖమండపంబున సుఖాసీను లయి యంచుగండపృథ్వీమహా....భక్తప్రక
రంబులును విజయసధ్యక్షులగు శుద్ధక్షత్త్రియులును, ధనపతిసమానసంపద్భాసితు
లగు వైశ్యులును, నిర్వక్రపరాక్రము లగువీరభటులును, శంకరపురాధ్యక్షులును,
స్థానా- - - యోగంబును, గుండలి దండలాసక ప్రేరణి ప్రేంఖణంబు లై
నచతుర్విధనృత్తగీతవాద్యాభిజ్ఞులును, గళావిలాసకరుణాబంధురబంధభేదంబులగం
ధర్వసంగరప్రవీణు లయిన - - - సియుండ శ్రీశాంతభిక్షావృత్తియతీశ్వ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రుండు శివకథావిధానంబులఁ బ్రొద్దులుపుచ్చుచుఁ దనమూలభృత్యుం డగుపుప్పల
పు ముమ్మడిదేవయ్యశాంతునిం గనుంగొని నీపేరన....కవిత్వంబున నీకథ యుపన్య
సింపు మన నుహాప్రసాదం బని సత్కవిసార్వభౌముం డగుశ్రీనాథకవిపరేణ్యుని
గృపావిశేషంబునం గాంచి శ్రీమన్మల్లికార్జునమహాదేవ . . . అంచుగండముఖ్యవ
రణా. . .లోష్ఠయేకోరామేశ్వరపండితారాధ్యాది చాతుర్వర్ణ్యంబులుం గలిగినమ
. . .యందు. . .బందినమల్లినాథగురుండు - - - - . ౧౩

సీ. (లింగార్చ)నక్రియాలీలనేప్రొద్దును గరికాలచోడని కరణివాఁడు
జంగమారాధనసక్త మైన - - - - -
- - - - - - - య్యసరణివాఁడు
వరధర్మచాతురీవైభవఖ్యాతిచే సేనమరాయనిచెలువువాఁడు
ననఁగ నిద్ధాత్రి నింపారు నఖిలకళల, నకలనిర్మాణవిద్యాప్రశస్తిఁ డనఁగ
మానితైశ్వర్యసంప్రాప్త - - -, మల్లికార్జునయోగిసమాజపరుఁడు. ౧౪

క. ఆతనినంశంబునఁ బ్రఖ్యాతిగఁ జరితప్రతాపకలనాధర్మం
డాతతవిక్రమశీలుఁడు, భూతలమునఁ గొమ్మవిభుఁడు పొలుపై వెలసెన్. ౧౫

సీ. చేవ్రారిభీమేశుఁ జెలువార గుండెలఁ బూజ గావించినపుణ్యమూర్తి
కడిమిమై నిరువత్తుగండనిచే మల్లికార్జునకుశ్వలం బర్థిఁ బడసెఁ
గొలనిరామారెడ్డివలన లింగాల - - - - రిమెతోడ
భక్తిరాజాఖ్యచేఁ బర్వతేశ్వరునకు నర్పించెఁ జెరువాడు నాతుకూరు
ధరణిఁ ద్రిపురాంతకున కాముదాలపల్లె, రాయవేశ్యాభుజంగువల్లాన యిచ్చె
నిట్టి పౌరుష - - - -, పోలిదేవయ్య చెన్నారుఁ బుణ్యమూర్తి. ౧౬

వ. ఆగురుస్వామి నిజవంశానుచారంబునకుం దగినతలోదరిం భరిణయుంబయ్యెనంత.

సీ. గారితలోదరి గాఁబోలునీభా - - - యుండు
శ్రీలక్ష్మి గాఁబోలుఁ జెలువసౌభాగ్యంబు దిక్కుల నెల్లను బిక్కటిల్లు
వాగ్దేవి గాఁబోలు వర్ణితబహుశాస్త్రపాండిత్యవిస్ఫూర్తిఁ బరిఢవించు
నింద్రాణి గాఁబోలు నిందునిభాస్య. . .ఖ్యాతిచేఁ బరఁగుచుండు
ననఁగ నేప్రొద్దు గుణముల నతిశయిల్లి, పరఁగ శ్రీశైలనాథునిపట్టనమునఁ
బోలిదేవయ్య కులసతి పుణ్యచరిత, ముదితసజ్జననికురుంబ ముమ్మమాంబ. ౧౭

ఉ. పోలయముమ్మమాంబికలు పుణ్యచరిత్రుల భక్తియుక్తులం
బోలఁగఁ గాంచి రేడ్వురను బుణ్యఋషీశ్వరసప్తతుల్యులం
బోలినపుత్రసప్తకము భూతహితార్థగుణప్రవృత్తి కై
లాలితవిక్రమోన్నతుల లక్షణదివ్యవిచక్షణాత్ములన్. ౧౮

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. శ్యామామనోహరరతిరాజనిభుఁడు శ్రీమల్లినాథాఖ్యుండు మహిమ వెలయు
- చారనిర్మలస్వాంతుండు శ్రీగిరినాథయ్య చెలువుమీఱఁ
బరమశైవాచారపాండిత్యగరిమల సెట్టిదేవాఖ్యుండు చెన్నుమీఱు
వైభవప్రఖ్యాతవరహరిశ్చంద్రుండు భీమేశ్వరస్వా - - -
వెలయముమ్మడిదేవయ్య వినుతకీర్తి, ఘనుఁడు కొమరగిరీంద్రుండు గలిగియుండు
- - పోతలింగాఖ్యుండు పొలువుమీఱు, సప్తఋషులకు నేప్రొద్దు సములు. . .

కం. - - - - - - గావలసెను
కారణజన్ముండు . . . పూరకి - - - - - - - ౧౨

సీ. లింగార్చనక్రియా . . . చెల్లించువిఖ్యాతి . . . య్యదండా . . . వాఁడు
- - - - - - - - -
పరమలింగధ్యానపారీణసద్బుద్ధి నల్లమప్రభులీల నలరువాఁడు
రుచ్యర్పణక్రియాసూఢి నిద్ధారణి మాదరచెన్నయ్య (మహిమవాఁడు)
చెలఁగె గురులింగజంగమసేవకుండు, మల్లికార్జునశివునకు మంత్రి యనఁగఁ
దూర్పునా డెల్లఁ బాలించు నేర్ప రతఁడు, శ్రీసమేతుండు పోలయసెట్టివిభుఁడు.

వ. అమ్మహాత్ముండు దనవర్ణనంబునకుం దగినవర్ణనీయ యగుసాధ్వి వివాహం బయ్యె నంత. ౧౩

సీ. పార్వతిమూర్తియు భారతీదేవియు నిందిరరూపంబు నింద్రుసతియు
రోహిణిదేవియు రుక్మిణీదేవియు స్వాహాస్వధాతులశక్తిచయము
గంధర్వసతులును గందర్పుభామయుఁ (గశ్యపు)సాధ్వులుఁ గ్రతువుసతులు
వరవసిష్ఠునిరాణి ధరఁగుంభసంభవురామయు నాదిత్యురమణిఁ గూడి
ధరణి నొక్కటఁ బుట్టించె ధాత యనఁగ, మగువ సెట్టిదేవాఖ్యనిమారమాంబ
(సకలసద్గుణవి)ఖ్యాతసారసాఖ్య, మహితపంచాక్షరీమంత్రమాన సాత్మ. ౧౪

క. సెట్టియమారమ గాంచెను, దట్టుల భీమయ్యఁ బ్రోలధరణీధవునిఁ
మట్టురగండని ముమ్మయ, సెట్టనవిలసిల్లువీరశేఖరు నర్థిన్. ౧౫

క. పారావారగభీరుఁడు, నారీజనమన్మథుండు నరనుతుఁ డనఁగా
ధారణి సెట్టియభీముఁడు, నారక వర్ధిల్లు నెపుడు వైభవ మలరన్. ౧౬

క. లాలితవైభవశీలుఁడు, లోలాక్షీమన్మథుండు లోకఖ్యాతుం
డాలోలచరిత్రుఁడు ధరఁ, బ్రోలామాత్యుండు వెలసెఁ బుణ్యోదయుఁ డై. ౧౭

సీ. పంచాక్షరీమంత్రపారిజాతోద్భూత ఫలము లేగురువుసంభాషణములు
వీరశైవాచారవిమలమార్గానూన శాశ్వతం బేగురుస్వామిమహిమ
నిఖిలదేశాధీశనివహప్రమేయకపాత్ర మేగురుమూర్తిపాదయుగళి
శంకరపూజాప్రశస్తదీక్షాజనా(హ్లాద మేగు)రువుహస్తాంబుజాత

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మనఁగఁ బండితచెనమల్లికార్జునునకుఁ, (బాత్ర)రత్నంబు సెట్టియప్రభునుతుండు
మారమాంబాతనూజుఁడు మహితయశుఁడు, వెలయు ముమ్మడిదేవయ్య వినుతకీర్తి.

ఉ. శ్రీగిరి(తూర్పుభాగ)మునఁ జెన్నగుభక్తిమహత్త్వ - -
- -గమవేదశాస్త్రముల నంచితధర్మకథాప్రసంగవి - -
- - విశేషసూత్రముల నాయతశక్తి నుభక్తియు - -
- - - - చెప్పుదు నెప్పుడున్ ... ౨౯

క. వార - - - సారార్థము లయినకృతుల సభలోపలఁ దా
గారామారఁగఁ బలికిన, శారద యీరూ పనంగ జగతిఁ (జనించున్.) 3౦

గీ. - - - - లాఖ్యమాన, భీకరుండు - -
(బసవశ)ంకరుండు పరవాదిమండూక,భయదపన్నగుండు భక్తిఘనుఁడు. 3౧

క. పీతాంబరుఁ బొలియించిన, ఖ్యాతచత్రురిండు జైనకాకోదరతా
ర్క్ష్యాతతబిరుదాంకుఁడు సం, జాతప్రవిలీనబిరుదనమ్మతుఁ డెలమిన్. 3౨

చ. పరిణయమయ్యెఁ గాంతఁ గులభామిని రుద్రయపుత్రి శాంకరిన్
నరసకలాభిరామ కులసంస్తుత(పుణ్య)చరిత్రయుక్త యై
యరయఁగఁ బుట్టినట్టి త్రిపురాంబికకూఁతురు భాగ్యదేవతం
బరమపతివ్రతానిలయ భానురనిర్మలగాత్రి సర్థిమై. 33

సీ. పరమపాతివ్రత్యభావంబు తలపంగ గౌరి గాఁబోలు నీకాంత తలఁప
సకలసంపత్స్ఫూర్తిచాతుర్యమహిమల నిందిర గాఁబోలు నిందువదన
సకలవిద్యాప్రౌఢి నడిసన్నగరిమల భారతి గాఁబోలు భామ యెప్పుడు
సర్వలక్షణగుణసంపన్నతోన్నతి నింద్రాణి గాఁబోలు నిగురుఁబోణి
యనఁగ నిద్ధాత్రి నేప్రొద్దు నతిశయిల్లెఁ,బరఁగ ముమ్మడిదేవయ్యభామ జగతిఁ
గామితార్థకసంధానకల్పవల్లి, యుజ్జ్వలద్గుణనికురుంబ యొమ్మమాంబ. 3౪

ఉ. ముమ్మడిదేవచంద్రునకు ముఖ్యతలోదరియొమ్మమాంబకు
... మ్మగవేదశాస్త్ర పరి- - - - శుద్ధయుక్తికిన్
ఇమ్మహి నెల్లవారలకు నీప్సితవస్తువిధాయియై ధరన్
నమ్మతి నుద్భవిల్లెఁ బరశాంతుఁడు శాంతనవాగ్రగణ్యుఁడై. 3౫

సీ. పరవాదిమత్తేభపంచాననాఖ్యుండు పరవాదిమండూకపన్నగుండు
పరవాదినవమేఘపవమానధీరుండు పరవాదిసాగరబాడబుండు
పరవాదికుత్కీలభాసురదంభోళి పరవాదికేంధనపావకుండు
పరవాదిచయతమఃపటలోగ్రభానుండు పరవాదిభోగినుపర్ణుఁ డనఁగఁ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జటులజైనకోలాహలసమరబిరుద,ఘనుఁడుసంగ్రామపార్థుండు వినుతయశుఁడు
శుభుఁడు ముమ్మడి దేవయ్యసుతుఁ డనంగ, వెలసె శాంతయ్య విక్రమవీరవరుఁడు.

గీ. వేడ్కఁ గవిసార్వభౌముని విమలచరితు, స్కాందపౌరాణికంబైన కథలలోన
ఘనత శివరాత్రిచరితంబుఁ దెనుఁగు గాఁగఁ,గరుణఁ జేయుము శ్రీనాథకవివరేణ్య.

వ. అనవుడు నమ్మహీసురాగ్రగణ్యుండు కమలనాభామాత్యపౌత్రుండును మారయా
మాత్యపుత్రుండును నగు శ్రీనాథకవివరేణ్యుండును సంతుష్టమానసుండై శాంత
స్వామి యొసంగినకర్పూరతాంబూలజాంబూనదాభరణంబులు స్వీకరించి స్కాం
దంబున నీశానసంహితం జెప్పంబడ్డ యురులింగోద్భవంబును శివరాత్రిమాహాత్మ్యం
బును...కథానిధానంబున కధీశ్వరుఁగా శాంత. - - ౩౮

షష్ఠ్యంతములు.

క. - - - - - దాననిర్మలమతికిం
గృత్యాకృత్యవివేకికిఁ, బ్రత్యర్థిద్విరదదళనపంచాస్యునకున్. ౩౯

క. రామామన్మథమూర్తికి, రామత్రయలీలమతికి రమ్యాత్మునకున్
సోమవ్రతవరశాంతికి, భీమజయోత్కటవిశేషభీకరమతికిన్. ౪౦

క. శైవాగమశాస్త్రావి, ప్రావీణ్యాగణ్యపుణ్యభరితాత్మునకున్
భావాభావవివేకికి, భావితవంశావతారపరమాత్మునకున్. ౪౧

క. జంభాంతకవైభవునకు, సంభృతశాస్త్రప్రతాపశైలోన్నతికిన్
శుంభత్ప్రాభవరతికిన్, దంభోళిస్ఫురితతీవ్రతరఖడ్గునకున్. ౪౨

క. పరముస్మయశాంతునకుం, బరమపరజ్ఞాననిధికిఁ బావనమతికిన్
నిరుపమవిక్రమయశునకుఁ, గరుణారసపూరితాత్తకలితాంగునకున్. ౪౩

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నభిమతార్థసిద్ధియు సత్యధర్మక్రియావృద్ధియు నగున
ట్లష్టాదశవర్ణనాగర్భంబుగా నత్యాశ్చర్యకరంబై యుండ నారచియింపంబూనిన
కథానిధానంబు సకలపాపనిర్ముక్తంబై సర్వవస్తుసంధానంబై సర్వలక్షణసంపన్నం
బై సర్వాగమామానసంభావితసంస్తుత్యంబై పరమధర్మోత్కృష్టంబై పరమేశ్వర
ప్రియంబై పార్వతీమనోహరంబై శ్రీనాథసేవితంబై బ్రహ్మరుద్రదేవతాదిసంస్తూయ
మానంబై శోభిల్లు నిష్పుణ్యచారిత్రంబు దశదోషవివర్జితంబై ... నానేర్చినవిధం
బున రచియించెద నది యెట్టిదనినఁ బూర్వోక్తమార్గంబునఁ బరిపూర్ణంబై యథా
విధి శోభిల్లునిప్పుణ్యచారిత్రంబుఁబోలినట్టిధర్మక్షేత్రంబును మహాతీర్థంబును నగు
గంగాకాళిందీసంగమంబున సంస్థితాత్ములు సత్యవ్రతపరాయణులు నగుశౌనకాది
మహామునులు దీర్ఘసత్రంబునందుఁ గూడియుండంగ వేదవ్యాసప్రియశిష్యుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

రోమహర్షణతనయుండు పౌరాణికుండు సూతాఖ్యాహిసంభవుండు సూతుం డేతెం
చిన సంప్రాప్తమానసు లయి యమ్మహామును లాసనార్ఘ్యపాద్యాదులం బూజించి
యతని కి ట్లనిరి. ౪౪

సీ. సర్వజ్ఞ రోమహర్షణతనూభవ సూత యఖిలపురాణవిద్యాప్రగల్భ
పంచాననవయుక్తభవ్యశాస్త్రవిదగ్ధ యాశ్చర్యహేతువు లైనకథలు
రత్నాకరములందు రత్నంబులునుబోలెఁ గలవు నీయందుఁ బొగడ్త గాదు
నీ వెఱుంగనివిద్య లీవిశ్వమున లేవు తర్కించి యెన్నివిధములఁ జూడ
నుత్తరోత్తరసత్కృత్య మొప్పు నీకుఁ, గాలనిర్ణయకలన నీకరతలంబు
పూర్వమున మేము సేసినపుణ్య మెల్ల, ఫలితముగ నేగుదెంచితి[1] ప్రార్థనంబు. ౪౫

వ. వేదంబులు నాలు గంగంబు లాఱు మీమాంసాన్యాయవిస్తరపురాణధర్మశాస్త్రంబు
లాయుర్వేదధనుర్వేదంబు లర్థశాస్త్రంబు లన నష్టాదశవిద్యానిధానంబులకు నాది
కర్త సదాశివుం డాశూలపాణి యమ్మహాస్థానంబులు బ్రహ్మ కుపదేశించె ననంత
రంబు శంకరాజ్ఞాప్రచోదితుండై కృష్ణద్వైపాయనాభిధానంబునన శాదినిధనుండు
పుండరీకాక్షుండును, నరణియందు వైశ్వానరుండునుంబోలె ద్వాపరాంతంబున
సత్యవతియం దావిర్భవించె వేదార్థోపబృంహణార్థంబు సర్గ ప్రతిసర్గ వంశ మన్వం
తర వంశానుచరితంబు లనుపంచలక్షణంబులం గలిగి బ్రాహ్మంబు వైష్ణవంబు
శైవంబు భాగవతంబు భవిష్యంబు నారదీయంబు మార్కండేయం బాగ్నేయంబు
పాద్మంబు బ్రహ్మకైవర్తంబు లైంగంబు వారాహంబు స్కాందంబు వామనంబు
కౌర్మంబు మాత్స్యంబు గారుడంబు బ్రహ్మాండంబులనుమహాపురాణంబులు పదు
నెనిమిది గల్పించె నవియును. ౪౬

గీ. గ్రంథసంఖ్యఁ బురాణసంఘంబు గూడి, నాల్గులక్షల నీపురాణములలోన
నూఱు వేల్గ్రంథములలోన నుతివహించి, శ్రీమహాస్కాందసంహిత శివునిఁ జెప్పు. ౪౭

వ. అందు శివరాత్రిమాహాత్మ్యంబు చెప్పంబడియుండు నమ్మహావ్రతం బెట్టి దెవ్వ రాచ
రించి రేఫలంబు నొసంగు మాకుం బరిపాటి తేటపడ విపరింపు మనిన నక్కథ
కుండు శౌనకాదిమహామునుల కి ట్లనియె. ౪౮

ఉ. తాపససార్వభౌములు సదాశివరాత్రిమహావ్రతంబు దో
షాపహృతిక్రమంబు వినుఁ డాదరణంబున నేను సద్గురు
శ్రీపదపద్మము ల్దలఁచి చెప్పెద శంకరసంహితాకథా
దీపితభవ్యమార్గమును దేటపడ న్మొదలింటినుండియున్. ౪౯

1 త ప్రార్థనంబ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. ప్రళయ కాలంబు తుదఁ గాళరాత్రి చనిన, నపర మగుసర్గమునకు బీజాంకురంబు
శీతమును నుష్ణమును గాఁగఁ జిలుపచిలుప, గంధవాహంబు వీఁచు నిర్గంధ మగుచు ౫౦

సీ. మూలముట్టుగను నున్మూలనంబును బొందిను మహీధరంబులు రూపుమాలియుండఁ
ద్రిభువనంబులు జలతృణరాశియునుఁబోలె సప్తార్చిచేత భస్మంబు గాఁగఁ
బుష్కలావర్తకాంభోధరంబులు వృష్టి విశ్వప్రపంచంబు వెల్లిగొనఁగ
భూర్భువస్స్వర్లోకములు మహర్లోకంబు జనలోక మెక్కి విశ్రాంతి మెఱయ
నఖిలదిక్కులు ముంచి బ్రహ్మాండగోళ, మప్పళించుచు . . . సప్తార్ణవములు
నిండికొనియుండఁగా రిత్తనింగితోడఁ, గొంతకాలంబు శూన్యమై గొడ్డువోయె.

వ. అప్పుడు బ్రహ్మ నారాయణుం డై శివయోగముద్రాముద్రితలోచనుం డగుచు
సముద్రంబునడుమం బవ్వళించిన. ౫౨

క. జనలోక మెక్కి సిద్ధులు, వినుతించిరి జలధిన(లిలవీచీరింఖ
ద్శున)జాతయోగనిద్రా, వినిమీలితదీర్ఘనయను విషధరశయనున్. ౫౩

సీ. దేవతలు సంస్తుతింపఁగఁ దెల్లవాఱెఁ, గల్పసంహారకాలంబు కాళరాత్రి
యంత మేల్కనికూర్చుండె నాదిపురుషుఁ, డాదిమబ్రహ్మ జగము సేయంగఁ దలఁచి.

గీ. అభినవోన్మేషజిహ్మ మైనట్టిదృష్టి, దిశలు వీక్షించెఁ ద్రిభువనాధీశ్వరుండు
చింతనొంది లోకంబు సృజింప వెఱవు, హృదయమున . . . ౫౫

ఉ. - - - - - లెందణంగిరో
చుక్కలసుద్ది యెద్దియొకొ చూడఁగఁ గందు మె పర్వతంబులన్
దిక్కులచాయ లెవ్వి యని ధీరత నల్వొటుచింత(నొందఁ గా)
- - - . - హృతి విశ్వము ముంచియుండఁగన్. ౫౬

క. అంతఃకరణంబున నటు, చింతిలి యుండుచుఁ బ్రపంచసృష్టికినిఁ గ్రియో
దరతమ్ము లేక దుర్వ్యథ, సంతసకట్టఁగ విధాత చాలం డయ్యెన్. ౫౭

వ. వెండియు బహువిధంబుల నూహాపోహ లొనర్చియుఁ బుండరీకసంభవుండు భువననిర్మాణక్రియారంభంబునకును పాయంబుఁ గానక చీకాకుపడి కాకోదరగ్రామణికంఠగ్రైవేయు భగవంతుం గృతాంతఘస్మరు సంస్మరించి తత్ప్రసాదంబున వసుంధరాగోళంబు మహాంధకారమగ్నం బగుట యెఱింగి యజ్జగద్ధాత్రుల నుద్ధరింపం దలంచి. ౫౮

శా. క్రోడాకారము [1]దాల్చికంఠభవఘుర్ఘురధ్వానవిస్ఫూర్తిఁ బా
తాళక్రోడమహాకటాహము సముద్ఘాటింపఁ దత్కంధరా

[1] దాల్చెఁగంఠ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గోళస్థాయిని యైనభూమి పృథువక్షోజప్రదేశంబున
నీలాసత్పులకాంకురంబు లెగయ న్వెన్నుండు మున్నీటిలోన్. ౫౯

గీ. లోఁతుమున్నీటిలోపల నీఁతలాడెఁ, గూటక్రోడావతారుఁడై కైటభారి
చటులవాలకశాఘాతసంప్రభూత, నీరమండూస్వనంబున నింగి యద్రువ. ౬౦

సీ. కాఁడిపాఱిన మేనిగరులు బ్రహ్మాండంబు నను పపూబంతి కక్కజముదోఁప
ఖురపుటంబునఁ గీలుకొని మేరుకుధరంబు మువ్వలోపలిఱాతిముసవు వడయ
దీర్ఘకంఠకఠోరఘుర్ఘురస్వనమునఁ బాతాళగోళంబు బాతలింప
నీలాంబుదశ్యామనిబిడదేహచ్ఛాయఁ బ్రళయాంతకాలంబు ధ్రోలకరింప
సప్తపాతాళములక్రిందఁ జాఁగిపడిన, యవని నెత్తె నిశాతదంష్ట్రాంకురమున
నభినవస్తబ్ధరోమదివ్యావతారుఁ, డంబురుహలోచనుండు కల్పాదియందు. ౬౧

వ. ఇవ్విధంబున మహాపర్వతసన్నిభంబును నీలమేఘప్రతీకాశంబును దంష్ట్రాదండదారుణంబును విపులవృత్తఘనస్కంధంబును సమున్నతకటితటంబును హ్రస్వవృత్తోరుజంఘాగ్రంబును దీక్ష్ణఖురమండలంబును బద్మరాగసదృశేక్షణంబును దృఢదీర్ఘమహాప్రోథంబును సముదీర్ణోచ్ఛ్వాసనిశ్వాసవిఘూర్ణితప్రళయార్ణవంబును విద్యుచ్ఛటాపాటలనటచ్ఛన్నకపౌలస్కంధబంధురంబును నయినవరాహరూపం బావహించి రసాతలంబున సలిలమగ్న యగుపృథివి నుద్ధరించిన. ౬౨

గీ. దానవారాతిదంష్ట్ర నెత్తంగఁబడిన, యుర్విచుట్టును జలధి నీరోడి - -
- - - - తవెలిపట్టుజగజంపుగొడుగువోలె. ౬౩

సీ. జయజయధ్వనులతో సనకాదిమునికోటి వేదాక్షరంబుల వినుతిసేయ
బహుళసౌరభమ - - లుప్పతిల్లంగ విద్యాధర - - విరులు గురియ
దివ్యదుందుభిసముద్ధితనినాదంబుల భూ - - ంభంబు బోరుకలఁగ
జోకయై యప్సరస్సుదతీకదంబంబు నింగిమీఁద బ్రమోదనృత్త మాడ
జద్దువడియుండెనొకకొంతప్రొద్దువేడ్క,నవయవంబులు గరుదాల్ప నచ్యుతుండు
ప్రళయజలనిధిక్రింద ....పడినయట్టి, యుర్విదంష్ట్రాంకురంబున నుద్ధరించి. ౬౪

గీ. సురలు తనమీఁదఁ బువ్వులసోన గురియఁ, జూడ నొప్పారె హరి శరక్రోడమూర్తి
కంధరంబుల ఖద్యోతగణము మెఱయఁ, జాల నొప్పారునంజనాచలమువోలె.

వ. ఇవ్విధంబునఁ బ్రలయసలిలోపద్రవంబుఁ దీర్చి ధాత్రిఁ బూర్వస్థానంబున సంస్థాపించి సర్వసర్వంసహాభారవహనంబునం బ్రభవించినప్రయాసఖేదం బుజ్జగించుటకయి పాఁపసెజ్జపై మున్నీటినట్టనడుమం బవ్వళించి నారాయణుండు నిజాంతర్గతంబున. ౬౫



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. దుర్వారోద్యమభంగి దంష్ట్రికతుదిఁ దూరంబుగా నెత్తి యేఁ
బూర్వస్థానమునందుఁ బెట్టితి యథాపూర్వంబుగా నిప్పు డీ
యుర్వీమండలి నెట్టివాఁడనొకో యోహో యంచుఁ జిత్తంబునన్
గర్వించె న్మధుకైటభాంతకుఁ డుదన్వద్వారిమధ్యంబునన్. ౬౭

గీ. అంత నిటఁ దాన తానగునబ్జభవుఁడు, దంభక్రోడావతారుఁడై ధాత్రి యెత్తి
సాగెఁ బ్రారబ్ధమార్గానుసారమునను, మొదలుకొని యెల్లవిష్టపములు సృజింప.

వ. మహత్సర్గంబు భూతసర్గంబు వైకారికసర్గంబునను బుద్ధిపూర్వకంబు లగుమూఁడును ప్రాకృతసర్గంబులు; ముఖ్యసర్గంబు, తిర్యక్సర్గంబు, దేవసర్గంబు, మానుషసర్గంబు, గ్రహసర్గంబును నా నేడును బుద్ధిపూర్వకంబులు వైకృతసర్గంబులు. కౌమార సర్గంబు, ప్రాకృతసర్గంబు నీతొమ్మిదియు నసాధకంబులు సాధకత్వంబును నైహికా ముష్మికహితాహితతదుపాయతత్ప్రతీకారవిరహితంబునం జేసి యప్రయోజనంబు లగుట నీతొమ్మిదిసర్గంబులవలనను బ్రయోజనంబు గానక కనకగర్భుండు మహే శ్వరునిం బ్రస్తుతించి తత్ప్రసాదంబునం బురాణప్రజాపతుల (కశ్యప) మరీచి భృగ్వాంగిరసపులస్త్యపులహక్రతుదక్షవసిష్ఠుల మానసంబునం దొమ్మండ్రను ధర్మా ధర్మసంకల్పంబుల మూఁటినిఁగూడఁ బన్నిద్దఱుపుత్రులఁ గాంచె. ఆపన్నిద్దఱవల ననుం బండ్రెండు దివ్యవంశంబులు ప్రజావంతంబులుఁ గ్రియావంతంబులునై ప్రవర్తిల్లె నందు దేవదైత్యదానవమునియక్షగరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యా ధరకర్మదేవతాప్సరఃకామినీరక్షోభూతపిశాచమనుష్యపశుపక్షిమృగోరగకీటకగిరి గ్రావవృక్షలతాగుల్మాదులును, గాయత్రీత్రిష్టుప్సామరథంతరంబులును, అగ్నిష్టోమ హయమేధవాజపేయాతిరాత్రపౌండరీకాదులు లోనుగాఁగలచరాచరంబులు ప్రా జాపత్యాంగోపాంగప్రత్యంగంబుల జన్మించె నవ్విధంబున నిఖలప్రపంచంబునిర్మించి విరించి నిజాంతర్గతంబున. ౬౮

ఉ. ఏ నధికుండ నాకుఁ బ్రతి యెవ్వరు నిర్జరకోటిలోన నేఁ
గాని జగత్ప్రపంచపరికల్పన సేయఁగ లేఁడు తక్కొరుం
డే నఖిలేశ్వరుండ నని యెవ్వరునుం బ్రతికోటి లేమిఁ దాఁ
దాన యహంకరించెను విధాత సదాశివుమాయ పెంపునన్. ౭౦

వ. ఇవ్విధంబున నవష్టంభంబుఁ గైకొని యంభోరుహసంభవుండు తాను సృజియిం చినభువనంబులు వీక్షింపం దలంచి రాయంచ తేరెక్కి దిక్కులఁ జరించునాఁడు ముందట. ౭౧

మహాస్రగ్ధర. అటఁ గాంచెం బద్మగర్భుం డహిమకరఘులీహస్తినక్రాదియాదః
పటలీధాటీవిహారప్రచలితమహీభృత్పక్షవిక్షేపలీలా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

చటులోర్మివ్యాప్తఘోషాసముపచితదిశాసౌధపీథీవిటంకా
పటుసంఘాటాప్రతిస్పృడ్భయకలితజగద్వ్యాప్తిలబ్ధి న్సుధాబ్ధిన్. ౭౭

లయగ్రాహి. [ఘటింపం
తోయజభవుండు మదిఁ బాయనియహంకరణమాయను జగంబుల కపాయము
జేయ సమకట్టి ఫణిశాయి నిరుపాధిశుభదాయకు సురాసురనికాయమకుటాగ్ర
స్థాయికురువిందసముదాయఘృణికోటివిశదాయతపదద్వయుఁ గళాయుతునిశ్రీనా
రాయణు రమారమణు డాయఁజనినిద్దురకురాయిడిగ నెవ్వఁడవురాయనుచుఁబల్కెన్.

క. లేలె మ్మెక్కడివాఁడవు, పాలసముద్రమున భోగిపర్యంకమునం
దేలెద వొక్కండవు నను, త్రైలోక్యాధీశు నెఱుఁగురా పరమేష్ఠిన్. ౭౮

సీ. పాతాళభువనసప్తకము నిర్మించితి వానితి విశ్వవిశ్వంభరయును
దిక్చక్రవాళ మెత్తితిఁ జక్కఁజేయఁగాఁ బాదుకొల్పితి గోత్రపర్వతముల
వరుసఁదీర్చితి నేడుశరనిధానములకు నారుమోసితి నరణ్యములు పెక్కు
గ్రహతారనక్షత్రగతు లేఱుపఱిచితి సరణు లేర్చితి నభస్వంతమునకుఁ
గదియఁ గూర్చితి బ్రహ్మాండకర్పరంబు, వరిధిగా వాల్చితిని మహావరణజలము
నిట్టినేఁ జేరవచ్చిన నెదురుకొనవు, పాన్పు డిగ్గవు దురవలేపమున నీవు. ౭౯

గీ. ఎవ్వఁడవు చెప్పు మనిన లేనవ్వు నవ్వి, యిందిరావల్లభుఁడు బ్రహ్మ కిట్టు లనియె
నే జగత్కర్తనై యుండ నెట్లు నీవు, కర్తనని పల్కెదవు సిగ్గుగాదె చెపుమ. ౮౦

గీ. విని యెఱుంగవె కల్పాంతవేళ నేను, దంభక్రోడావతార ముద్ధతి నహించి
సర్వసర్వ - - - సరణి, దాల్చినాఁడను దంష్ట్రికాదండకోటి. ౮౧

శా. ఏలా వచ్చెదు డాయ నెవ్వఁడవు నీ వెచ్చోటికిం బోయె దీ
వేలా మ్రొక్కవు నాకు గర్వ మిఁక నెంతే నోర్వకుండుం జుమీ
త్రైలోక్యాధిపుఁడ న్సురాసురశిరోరత్నప్రభామండలీ
వ్యాలీఢాంఘ్రిసరోరుహుండ విడు గర్వారంభసంరంభమున్. ౮౨

గీ. అని వసుంధర నుద్ధరించినబలంబు,భువనసర్గం బొనర్చినపూనికయును
గారణంబులుగాఁగనాగ్రహముపూని, యచ్యుతుండునునజుఁడుగర్వాంధులగుచు.

వ. ఒండొరు నెఱింగినయయ్యిద్దఱు మహేశ్వరుమాయాప్రభావంబున. ౮౩

గీ. నన్ను గెల్చికదా నీవు నలిననాభ, యఖిలలోకేశ్వరుఁడ వాట యనియె బ్రహ్మ
నన్ను గెల్చికదా నీవు నలినగర్భ, యఖిలలోకేశ్వరుఁడ వాట యనియె శౌరి. ౮౪

వ. అని యవష్టంభవిజృంభణంబున. ౮౫

గీ. ఇందిరానాయకుఁడు శార్ఙ్గమెక్కువెట్టె, గాండివము సజ్యముగఁజేసెఁ గమలభవుఁడు
శరము లిద్దఱుఁ గాలాగ్నిసన్నిభంబు,లేసి రొండొరుపై శౌర్య మెసక మెసఁగ. ౮౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. జన మేపారి మురారిపద్మజభుజాచక్రీభవచ్ఛార్ఙ్గగాం
డివకోదండవినిర్గతప్రభల సందీప్తాస్త్రసంఘాతముల్
భువనక్రోడము నిండి భానుకిరణంబుల్ దూఱనీకుండఁగాం
బనలుం బర్వె మహాంధకారములు పైపై నూచినిర్భేద్యముల్. ౮౪

గీ. గాండివము తేరిపైఁ బెట్టి కమలభవుఁడు, శార్ఙ్గమున నచ్యుతుండేయుసాయకములఁ
గర్కశం బైనకుశపూలకమున ద్రేసి, ఖండఖండములుగఁ జేసెఁ గదనవీథి. ౮౫

క. వాలికమెఱుంగుఁదూపులు, నాళీకాసనుఁడు కినుక నారాయణుపైఁ
గీలుకొనఁ జేసి యార్చెను, నాలుగుమోములను ద్రిభువనము వణఁకాడన్. ౮౬

వ. ఇవ్విధంబున విధాత యార్చి పేర్చినఁ గోపాటోపంబునం గటకటంబడి కైటభాంత
కుండు లలాటవీథీవిటంకంబున భ్రుకుటి నటింపఁ గల్పాంతవేళాసముజ్జ్వలజ్జ్వలన
జ్వాలాజాలలీలాక్రీడాపహమహాప్రభామండలమధ్యవర్తియు విబుధరిపుసధూనైధస్య
దానదీక్షాధురంధరప్రభాపరాక్రమక్రీడానిర్వక్రపరాక్రమం బగుచక్రం బతని
మీఁదఁ బ్రయోగించిన. ౮౭

మ. దిశలు న్నిండగియు నేలయు న్బహులదీప్తివ్యాప్తి నంతర్భవిం
ప శతానందునిమీఁద సాగుటయు నప్పద్మాసనుం డేసె బ్ర
హ్మశిరోనామక మైనయస్త్ర - - - స్త్రాపాదిదైవంబు న
వ్విశిఖం బుద్ధతి మ్రింగె నచ్ఛుతగతి న్వేవేగ నాచక్రమున్. ౮౮

గీ. హరివిధాతపైఁ బాశుపతాస్త్ర మేసె, నజుఁడు హరిమీఁదఁ బాశుపతాస్త్ర మేసె
నమ్మహాస్త్రంబు - - - - - ములును ౮౯

చ. పటుతరవిక్రమస్ఫురణఁ బాశుపతంబులు రెండుఁ బోరఁగాఁ
జిటిలినవిస్ఫులింగములఁ జిల్లులు వోయె నభఃస్థలంబు ది
క్తటము - - - - - గర్భగోళసం
పుటములు వొక్కె నుమ్మదము పుట్టెఁ జెమర్చెఁ బురాణకూర్మమున్. ౯౦

ఉ. పాశుపతాస్త్రరాజము లభంగధృతిం దమలోనఁ బోర ఘో
రాశనిఖండసన్నిభము లైనతదీయకృపీటసంభవో
ల్కాశతము ల్పరస్పరవిఘట్టనఁ జిచ్చుఱకోల లై వెసం
గేశవుమేన బ్రహ్మమెయిఁ గేలియొనర్చె నపారవేదనన్. ౯౧

ఉ. కాంచనగర్భుఁడు న్నరకఘస్మరుఁడుర్విఁ బహుకాల మీక్రియం
గాంచిరి నొచ్చి పాశుపతకాండయుగప్రభవాగ్నికీలలం
జంచలచిత్తవృత్తి బహుసంపదపెంపున మూరివోయి ద
ర్పించినయట్టివారి కివి పెద్దలె యచ్చెరువంద నేటికిన్. ౯౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. పాశుపతములు రెండు నిభ్భంగిఁ బోర, నజుఁడు హరియును వారింప నలవిగాక
విస్ఫులింగచ్ఛటావళీ వేష్టనమున, స్రుక్కుచుండిరి యంగముల్ సొక్కిపడఁగ. ౯౩

గీ. త్రిభువనంబును భయమందె దేవదైత్య, ఖచరసిద్ధగంధర్వులు కలఁగఁబడిరి
అస్త్రరాజద్వయంబు సంహారకాల, దహనుభంగినేకాంగయుద్ధంబు సేయ. ౯౪

గీ. అస్త్రయుద్ధము మాన్పహర్యజులఁ గావఁ, దలఁచి యర్ధేందుమౌళి యత్యంతకరుణ
నస్త్రములు రెంటి నడుమ నయ్యవసరమున, సంభవించె మహాస్తంభ శంభుమూర్తి.

స్రగ్ధర. స్తంభం బావిర్భవించెన్ జ్వలదనలశిఖాజాలము ల్దిక్కులందున్
జృంభించె న్భూర్భువస్స్వస్థిరతరజఠరక్షేత్రము ల్పంచదుల్కా
సంభారోద్యత్స్ఫులింగస్థగితములుగ నాశంక విశ్వంభరుండున్
శంభుండు న్సంభ్రమింపం జటులతరతటిత్సన్నిభస్ఫూర్తిమూర్తిన్. ౯౬

సీ. సప్తపాతాళవిష్టపములు భేదించి ధరణిచక్రంబు భింపం బొనర్చి
భూర్భువస్స్వర్లోకములు సమాస్ఫాటించి ధ్రువమండలంబుఁ దుత్తుమురుచేసి
పరమేష్ఠిపదవి కుద్భ్రాంతి యాపాదించి హరిపదంబున కార్తి యావహించి
బ్రహ్మాండకుహరకర్పరము వ్రక్కలువాపి యావరణంబు లందంద చించి
పరఁగఁ బుష్కరమార్గంబు పాయఁబట్టి, యెగసి యెచ్చోటికేగెనో యెఱుఁగరాదు
శాతకుంభాద్రికూటాగ్రసన్నిభంబు, శాంభవం బైన పావకస్తంభ మపుడు. ౯౭

గీ. పాలుగలయగ్గికంబంబు ప్రభవమంది, యుష్ణమును శీతమును గాక యుండెఁ గాని
యహహ పెట్లు జగం బుష్ణ మయ్యెనేని, శిశిర మగునేని వణఁకును సీతువట్టి. ౯౮

సీ. అద్భుతం బందిరి హరియుఁ బద్మభవుండుఁ దమలోని తీవ్రరోషములు మాని
పుష్కలావర్తకాంభోధరవ్రాతంబు గురిసెఁ గల్పకలతాకుసుమవృష్టి
జయజయధ్వనులతో సనకాదియోగీంద్రు లభినుతించిరి ప్రస్ఫుటాక్షరముల
నమరదుందుభినినాదములు దిక్కులనిండె గంభీరతరమహాఘనరవముల
నణఁగె నస్త్రద్వయంబు నభ్యంతరమున, నగ్గికంబంబులోఁ గానవయ్యె శివుఁడు
వలిపెతెరలోన నున్నభావంబు దోఁప, మాఘకృష్ణచతుర్దశీమధ్యరజని. ౯౯

గీ. హంసరూపంబు దాల్చెఁ బద్మాసనుండు, దంష్ట్రిరూపంబు గైకొనె దనుజరిపుఁడు
పోయి రంబరమున కధోభువనమునకు, నూర్ధ్వమును గ్రిందుఁ గానంగ నుత్సహించి.

క. బహువర్షసహస్రంబులు, ద్రుహిణుండును హరియు నధ్యధోభువనముల్‌న్
బహులక్రియ శోధించిరి, దహనస్తంభంబు తుదయుఁ దన్మూలంబున్. ౧౦౧

వ. శోధించి యాద్యంతంబులు పొడగానక హరివిరించు లేతెంచి వామదక్షిణంబుల
నిలిచి జగత్కారణం బయినయమ్మహాదేవు నిట్లని స్తుతియించిరి. ౧౦౨

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. శర్వ లోకాధీశ చంద్రార్ధశేఖర పురుషపురాణ శంకర మహేశ
యభవ యంతర్యామివై ప్రేరకత్వము చేపట్టి జనుల శాసింతు వీవు
భవదీయమాయాప్రభావంబుకతమున నెఱుఁగలేమయితిమి యేము నిన్ను
మాకుఁ గర్తవు నీవు మాకు భర్తవు నీవు మాకు హర్తవు నీవు మాట లేల
నీమహత్త్వంబు వర్ణింప నేర మేము, నిన్నుఁ దెలియంగ నేరము నిజము గాఁగ
నభవ యాద్యుండ వాద్యుండ వగుదుగాన, నట్టినీ కాచరింతు మువాస్తి యెపుడు.
గీ. పశువులము మేము హర పశుపతివి నీవు, పశువులకు నెక్కడిది బుద్ధి ఫాలనయన
రాజశేఖర నేర్పునేరములు చూడ, కరసిరక్షింపు మమ్ము నత్యంతకరుణ. ౧౦౪
గీ. విష్ణుమూర్తులు[1] కడచన్న వేళలందు, నజునిమూర్తులు గడచన్నయవసరమున
విశ్వమూర్తులు విబుధులు వెడలునపుడు, కలదె నీకు నపాయంబు కాలకంఠ. ౧౦౫
గీ. అమరవంద్య దివాభీత మనెడిపులుఁగు, హేళిమండల మీక్షింప నెట్లునేర్చు
నేము నిను వినుతింపఁగ నెంతవార,మిమ్మహాపరాధము క్షమియింపవలయు. ౧౦౬
వ. అని స్తుతియించినం బ్రసన్నుండై విరూపాక్షుం డాక్షణంబ లింగమధ్యంబున వెడలి యర్ధనారీశ్వరుండును త్రినేత్రుండును నీలలోహితుండును వరదాభయమృగాంకధరుండును సర్వాభరణభూషితుండును బ్రమథగణసమన్వితుండును గోటిసూర్యప్రకాశుండును బాలచంద్రావతంసుండును నై సన్నిధియగుటయుఁ బెన్నిధిఁ గన్నపేదలవిధంబుంబోలి విరించినారాయణు లిట్లనిరి. ౧౦౭
సీ. ఇభచర్మపరిధాన యేభక్తిచేసిన సంతసం బందు నీయంతరంగ
ముడురాజమౌళి యేయుపచారములు నీకుఁ బ్రియములై యుండు నెంతయునుగరిమ
నగరాజకన్యకాప్రాణేశ నీకు నేకెలనఁ బో సర్వాంగకృప జనించుఁ
గ్రతువైరి నీకు నేవ్రతముఖ్య మొనరింపఁ గౌతుకోన్మేషంబు గలిగియుండు
నంధకాసురదమన నీ కభిమతంబు, లేయనుష్ఠానములు శర్వ యేమఖంబు
లాచరించిన నీవారమగుట యట్టు, లభవ దాక్షిణ్యపరత మాకానతిమ్ము. ౧౦౮
వ. అనినఁ బ్రీతచేతస్కుండై శివుండు విశ్వంభరాంభోరుహసంభవుల కిట్లనియె. ౧౦౯
మ. అవధానంబున నాకు సంశ్రయము సేయ న్సర్వదా మీకు న
వ్యవసాయం బొడఁగూడెనేని వినుఁడాయంభోజదృగ్భారతీ
ధవులారా విని యాచరింపుఁడు మదిం దాత్పర్య మొప్పంగ శ్రీ
శివరాత్రివ్రత మస్మదీయ మది దాక్షిణ్యంబునం జెప్పితిన్. ౧౧౦
వ. బ్రాహ్మీముహూర్తంబునందు మేల్కని శౌచక్రియలు నడపి గురున కభివాదనంబు సేసి సంకల్పంబు నడపి పూజోపకరణద్రవ్యంబులు సమకూర్చుకొని నదీస్నానంబు

---

[1] విష్ణుమూర్తులు — మూ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వానర్చి నిత్యనైమిత్తికాద్యనుష్ఠానంబులు దీర్చి యలంకృతుండయి యజనస్థానంబును సమ్మార్జనలేపనాదుల శోధించి వితానధ్వజంబు లెత్తించి పతాకానలులు గట్టి తోరణంబులు సంఘటించి దేవాలయంబు ప్రవేశించి మౌనియై భసితత్రిపుండ్రంబును భస్మోద్ధూళనంబును గావించి రుద్రాక్షమాలికలు ధరియించి శివభక్తుల రావించి గురూపదేశమార్గంబున నాసనంబుఁ బాద్యం బర్ఘ్యంబు మధుపర్కంబు నిచ్చి పంచవదనంబులుఁ బంచామృతంబుల నభిషేకించి ఫలోదకపుష్పోదకగంధోదకకుంకుమోదకరత్నోదకకర్పూరోదకంబుల నభిషేకించి వస్త్రం బుపవీతం బాచమనంబు గంధంబు భూషణంబు పుష్పంబు ఫలాహారంబు నీరాజనంబు ధూపంబు వ్యజనంబు వాదిత్రంబు దర్పణంబు స్తోత్రంబు మొదలుగాఁగలషోడశోపచారంబుల నుపచరించి నాలుగుజాలు జాగరంబు సేయునది యీవ్రతచర్య ప్రకారంబు. ౧౧౧

గీ. బ్రహ్మహత్యాయుతము సురాపానశతము, వీరహత్యగోహత్యలు వేనవేలు
శిశువధంబులు జంగమ (శ్రీవినాశ) మాదియగుపాపములఁ దోలు నభవురాత్రి.

వ. తొల్లి యొక్కబ్రాహ్మణుండు మహాపాపంబులు సేసి శివరాత్రిదర్శనంబున శివపురంబునకుం జనియె ననిన శౌనకాదు లక్కథకున కిట్లనిరి. ౧౧౩

గీ. అద్భుతం బయ్యెడిని మాకు నగ్రజన్ముఁ, డెట్టు పాతకములు సేయుఁబెట్టు లట్టి
పాపి శివరాత్రివ్రత మెట్టు పరఁగఁ జూచె, నంతయును విస్తరింపుమా యనినఁ బ్రీతి.

శా. జీమూతాన్వయరాజధైర్య సుమహాక్షీరాబ్ధిగాంభీర్య సు
త్రామప్రోద్భవగాఢశౌర్య సుమనోధన్వాతిసౌందర్య పౌ
లోమీనాయకతుల్యభోగయుత సుశ్లోకారిజిత్త్యాగ భా
షామాధుర్యమతిప్రకాశధిషణా సత్యార్థసంభాషణా. ౧౧౪

క. నిత్యయశశ్శ్రీసుందర, మత్యమరాచార్యవర్య మాన్యచరిత్రా
భృత్యజనావనతత్పర, సత్యహరిశ్చంద్ర సరససాహిత్యనిధీ. ౧౧౫

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్రమారయామాత్యపుత్ర
సకలవిద్యాసనాథశ్రీనాథనామధేయ ప్రణీతంబయిన
శివరాత్రిమాహాత్మ్యంబునందుఁ
బ్రథమాశ్వాసము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

—oo:o:oo—

### ద్వితీయాశ్వాసము.

క. శ్రీ హిమవద్గిరిపుత్రీమ, నోహరపదభక్తిజాతనూతనసరస
వ్యాహారకావ్యనాయక, మోహనతనుజితజయంత ముష్మయశాంతా. ౧

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లని చెప్పందొణంగె. ౨

సీ. కాంచనాచలముతో గర్వించి యేకొండ పెఱిఁగె బ్రహ్మాండకర్పరము మోవ
నేకొండచఱులపై హిమశైలకన్యక చెంచు లేమలఁగూడి సంచరించు
నజ్రాలకమరుతేవ విడంబనముసేయు నేకొండ మొలచుట్టు నిందుతనయ
యల్లోనేరెడుదీవియవనీధ్రములలోన నేకొండ కైశ్వర్య మెక్కుడయ్యె
నట్టివింధ్యనగేంద్రపర్యంతభూమి, దండకారణ్యవిపినమధ్యంబునందు
రత్నపుర మనఁ గల దొకరాజధాని, కిన్నరాధీశునగరికిఁ గీసవెలితి. ౩

గీ. స్ఫటికమాణిక్యపాషాణఘటిత మైన, యప్పురముకోట యాకాశ మంటి యొప్పు
వేడ్కఁ బాతాళభువనంబు వెడలివచ్చి, చుట్టుచుట్టినయట్టివాసుకియుఁబోలె. ౪

గీ. పట్టనంబునఁ దేవతాభవనకోటి, తుహినగిరికూటములతోడఁ దులలుతూఁగు
నమరగంగాపయఃప్రవాహములఁ బోలుఁ, దచ్ఛిరస్థాపితోన్నతధ్వజపటములు.

సీ. మకుటదేవకిరీటమణిమయూఖచ్ఛటాపటలకిమ్మీరాంఘ్రిపంకజుండు
వికటపాటలజటామకుటకోటిఘటితకోమలతారకాకాముకుండు
గంధదంతావళక్రవ్యాదరాట్కృత్తికంథాధురంధరకంధరుండు
కుంభినీధరసుతాకుచకుంభమృగమదస్థానకస్థగితవక్షఃస్థలుండు
శంభుఁడోంకారనాథుండు శాశ్వతుండు, పాయకయ యుండునవ్వీటిపరిసరమున
నర్మదాసింధుతీరకాంతారభూమి, మఱ్ఱి యనుపేరికల్పద్రుమంబు మొదల. ౬

వ. అప్పట్టనంబునకుఁ జుట్టును జనపదంబు లిలావతీశతద్రువిపాట్సింధునదీమాతృకంబులును, విశ్వవిశ్వంభరాభ్రాలతానుకారిసేతురేఖాలంకారంబులును, దటాకతరుకుసుమకేసరక్షరదమందమకరందధారాధోరణీసహస్రసంవర్ధితకుల్యాసలిలకల్లోలమాలికాస్ఫుటస్ఫాయమాననానావిధోద్యానవాటికాసంఘసంఘటితాకాల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కాలాంధకారంబులును, నారానుచూతపోతనికరసుకుమారకిసలయాస్వాదకషాయకంఠ కలకంఠ కామినీకోమలకుహూకారకోలాహలాంకురితపంచమరాగరాజంబులును, రాజాన్న కలమ షాష్టిక పతంగప్రియ నానావ్రీహిసస్యప్రశస్తంబులును, ప్రవర్ధమానవనంబులును, నిబిడితసారసికంబులును, గుళుత్థాభ్యుత్థానంబులును, సముద్గతముద్గసామగ్రీసంగ్రహంబులును, అణుకచణకచణంబులును, సిద్ధార్థ శ్యామాక గోధూమ శర్కరాతిలజర్తిలంబులును, అమూషితమహోరదూషితక్షేమంబులును, కుస్తుంబురుకుసుమగుచ్ఛచ్ఛాయాచ్ఛటా భృంగశోణభంగోర్మాణు శృంగారిత జాంగలక్షేత్రంబులును నై దాశరథిచరిత్రంబునుం బోలె సీతావృత్తినరళంబును, చంద్రోదయంబునుంబోలెఁ గరసహస్రసంవర్ధితరత్నాలయంబును, యదువంశంబునుంబోలెఁ గులక్రమాగతశూరపురుషోత్తమబలాభిపాలితంబును నై యుండు వెండియు. ౭

మ. పరలోకస్థుఁ బలిఁ గ్రుఘపాంకు బ్రదికింపంగోరి యోంకారశంకరుమ్రోల్ రతి ముక్తకంఠముగ నాక్రందించె నా నొప్పు నప్పురబాహ్యోపవనాంతదీర్ఘికలనా - - - - - - నోలాడుపుష్కరకింజల్కభుజిక్రియాసుఖితహంసక్రేంక్రియారావముల్. ౮

మ. ధరణీచక్రముఁబోలెఁ నప్పురము విస్తారంబు నాయామముం
బరికింపంగ నశక్య మైనగరిమం బాథోధిగంభీరతం
బరిఖామండల మంబురాశి నుపమింపం బాత్రమై యొప్పు నం
బరకల్లోలలుఠత్తిమింగిలఘులీమత్స్యాహిసక్రోద్ధతిన్. ౯

గీ. భద్రజాతియేనుంగు లప్పట్టనమునఁ, బ్రకటితస్ఫూర్తి నొప్పు సిబ్బములతోడ
విమలవారాశిఫేనఖండములతోడి, కప్పపుంగొండబందులో కాక యనఁగ. ౧౦

ఉ. లక్షలసంఖ్య లప్పురికెలంకులయందుఁ గొలంకు లొప్పు వాః
పక్షిగరుచ్ఛటాపవనపాతవికంపితపంకజంబు లై
వీక్షణకౌతుకంబు ప్రభవించుచునుండును లీలమై సహ
స్రాక్షుఁడు విశ్వరూపమహిమాద్భుతముం బ్రకటించెనో యనన్. ౧౧

శా. ఆవింధ్యాచలదుర్గ మేలు శబరాధ్యక్షుండు హేమాంగదుం
డావార్ధిద్వితయద్వయావధిగఁ జక్రాధీశ్వరుల్ గొల్వ నా
శావేదండఘటాకపోలతలమూర్ఛద్దానధారాజల
ప్లావప్రక్రమసంవిశుద్ధబహులప్రస్ఫూర్తిమత్కీర్తి యై. ౧౨

సీ. శివునికైవడి మహాసేనానియాత్ముండు బలభేదిపగిది నపవ్యపాయుఁ
డరవిందహితులీల నధిగతాభ్యుదయుండు బుధునిక్రియ నజహాత్పుష్కరుండు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గంగాప్రవాహంబు కరణిఁ బావనమూర్తి భుజగాధిపునిభంగి భోగశాలి
యేనుంగుచందాన దానధారాశోభి శౌరిలాగున శంఖచక్రపాణి
కర్త యాశ్చర్యములకు నాకరము నీతి, కళలవిద్యాగమములకు నాస్పదంబు
పగఱ కుత్పాతకేతువు బంధుకోటి, కమరలోకద్రుమంబు హేమాంగదుండు. ౧౩
గీ. ఆనృపాలుండు నీతివిద్యానిరూఢిఁ, జారదృష్టి యొఁ గాని విచారదృష్టి
సమధికైశ్వర్యవైభవోజ్జ్వలత నాతఁ,డష్టమూర్తి యొఁ గాని యనష్టమూర్తి. ౧౪

## యజ్ఞదత్తచరిత్రము.

వ. ఆరాజునకు నఖిలశాస్త్రవిద్యాకళాపావనగంభీరబుద్ధి యజ్ఞదత్తుం డను బ్రాహ్మ
ణుండు దేవేంద్రునకు బృహస్పతియును వృషపర్వునకు శుక్రుండును దశరథునకు
వసిష్ఠుండును రామునకు విశ్వామిత్రుండును నజాతశత్రునకు ధౌమ్యుండును నలు
నకు దమనుండునుంబోలెఁ బ్రధానియై రాజ్యభారంబు భరియించియుండు నమ్మం
త్రిభార్య వినయవతి వివేకవతి విభ్రమవతి విలాసవతి సౌభాగ్యవతి లక్షణవతి యౌ
దార్యవతి గాంభీర్యవతి యన సర్వగుణసంపూర్ణ సుశీలాభిధాన యగు బాలారత్నం
బతనికిఁ బరమప్రియాస్పదం బై యుండు. ౧౫
గీ. అన్నిభాగ్యంబు లున్న నాయబ్జముఖికి, శ్రీమహాలక్ష్మి గలుగఁగ నేమిసెలవు
పుత్రవదనావలోకనోద్భూతమైన, యొక్క సౌఖ్యంబు బ్రాఁతియైయుండుఁగాన.
గీ. తనయసంతానలబ్ధి దొడవు గాఁగ, విభవసంపత్తి గల్గియు విన్నఁబోయి
వనిత నిష్ఫలపుష్పదర్శనముఁ దాల్చె, శరలతాకాననమువోలె జవ్వనంబు. ౧౬
సీ. కాంత పుష్పాదిభోగంబు లింపెసఁగిన వైరాగ్యవిధికిఁ దా వాల్చుఁ జిత్త
మన్వయంబునకుఁ దా నాలంబ మయ్యును దను నిరాలంబఁ గాఁ దలఁచు నింతి
ప్రొద్దునఁ దగినట్టిభోజనం బొల్లక యుపవాసనంబుండ నువిద దలఁచు
సంపత్పరంపర సంభవిల్లిననైన సంతోష మొదవదు చామమతికిఁ
గోమలాంగుళదళహస్తతామరసము, కర్ణపూరత్వలీలకై కాలు సాఁప
గండతలదర్పణంబునఁ గదియఁ జేర్చి, పడఁతి చింతించు సుతలబ్ధి వడయుటకును.
ఉ. సంతతి లేని దుఃఖమున సామజరాజ్యఘటాంతవైభవం
బెంతయుఁ గల్గియున్ సరసిజేక్షణ చిన్నఁగఁబోయి యుండు నే
మంతిని బోటికత్తెలకు మానసవృత్తి యెఱుంగఁజెప్పు శే
కాంతమ కేళిశయ్యపయిఁ గాంత గుణించు మనోరథార్థముల్. ౧౭
ఉ. ఆచపలాయతాక్షి కనకాంబురుహంబులఁ బూజసేయు విం
ధ్యాచలకందరానిలయు నద్రిసుతాప్రియనాథు నర్మదా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వీచిపరంపరాసలిలవిప్రుషదాశ్రయశీతగంధవా
హోచమనప్రవృద్ధభుజగాధిపకంకణు నోంకృతీశ్వరున్. ౨౧

సీ. అభిషేక మొనరించు నలినీలకుంతల శంభు సోమోద్భవాసలిలధార
నెలఁత యభ్యర్చించు నీలోత్పలంబులఁ దరుణనిర్మలసుధాధామమౌళి
గరళకూటగ్రాసకల్మాషకంధరుమీఁద గంధ మలందు మీననేత్ర
యర్పించు దివ్యోపహారంబు లెలనాఁగ కుటిలకుండలిరాజకుండలునకు
నతివ దిరుగుఁ బ్రదక్షిణం బభవుగుడికి, గుచభరంబున నరగౌను గూనిగిలఁగ
రవలిమట్టెలమ్రోఁతతో రాయిడింపఁ, జరణనూపురఝుళఝుళంఝుళరవంబు. ౨౧

వ. ఒక్కనాఁ డోంకారనాథునకుఁ బ్రదక్షిణం బాచరించుచు నప్పద్మాక్షి ప్రాకార
పురఃప్రఘాణంబున నొక్కపౌరాణికుండు మహాభారతంబు వక్కాణించువాఁ డపు
త్రకులకుఁ బుణ్యలోకంబు లే దని కథానుకథనప్రసంగంబునం బలికిన నయ్యింతి
సంతానవిరహవేదనాధూయమానమానసయ్యై మందిరంబున కేతెంచి యేకాంత
భవనంబున విరహాళయ్యపై మేను వైచి చింతాక్రాంత యై యుండె నంత యజ్ఞ
దత్తుం డమ్మత్తకాశిని నన్వేషించి. ౨౨

ఉ. కాంతసరోజనాళలతికాతనుపాండుశరీరయష్టి నే
కాంతగృహాంతరస్థితఁ బ్రియాంగనఁ జేరఁగవచ్చె మంత్రి క
ల్పాంతమునన్ రసాతలగుహాకుహరంబున డాఁగియున్నభూ
కాంత వరాహమూర్తి హరి గ్రచ్చఱ డాయఁగ వచ్చుకైవడిన్. ౨౩

వ. డాయవచ్చినఁ గృతప్రత్యుత్థానయగు నప్పంకజాక్షియుఁ దానునుం బర్యంకంబునఁ
గూర్చుండి యవిరళాశ్రుపాతార్ద్రీకృతదుకూలయు ననలంకృతయు నైన నుశీలం
జూచి యజ్ఞదత్తుం డిట్లనియె. ౨౪

గీ. ఏల యేడ్చెదు చెప్పవే యిందువదన, విపులశోకభరంబున వెక్కివెక్కి
త్రాటఁ గ్రుచ్చినముత్యాలదండవోలెఁ, జన్నుఁగవ నున్న వీబాష్పజలకణములు

సీ. కుదురు నిండినమంచిగుబ్బచన్నులమీఁద ధరియింపవేల ముత్యాలపేరు
ఫాలేందురేఖపైఁ బచరింప విదియేల కుంకుమంబునబొట్టు గోరఁ దీర్చి
యానచక్రోద్ధురం బగునితంబముమీఁద నవరింపవేల వజ్రాలకమరు
పాయవట్టములతోఁ బసిఁడినూపురములు హత్తింపవేల పాదాంబుజములఁ
బంచవన్నియరాచిల్కఁ బంజరమున, నేల సదివింప వనురాగ మెసకమెసఁగ
నేల చింతించెదవు చెప్పు మిందువదన, గండపాళికఁ గెంగేలు గదియఁజేర్చి. ౨౬

గీ. నెలఁత నలివేఁడి యైననీనిడుదయూర్పు,మాటిమాటికి నిపుడు నామానసంబుఁ
గంపమొందించుచున్నది కల్లగాదు, ప్రబలభవదీయవక్షోభవంబుఁబోలె. ౨౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. అపరాధము సేయఁ గదా, చపలాయతనేత్ర! యేను జనవున నేని
న్నిపుణతతోఁ జింతించిన, నెప యేమియుఁ గానరాదు నీ నెగులునకున్. ౨౭

క. భవదాయత్తము విభవము, భవదాయత్తంబు సువ్వె ప్రాణము నాకున్
భవదాయత్తము సర్వము, ధవళాంబుజపత్రనేత్ర తథ్యం బరయన్. ౨౮

వ. ఈదుఃఖంబునకుం గారణం బేమి చెప్పు మని యడుగుటయుం బ్రత్యుత్తరంబీక యూరకున్న దానితాంబూలకరంకవాహిని మంత్రితో నిట్లను:—దేవ దైవంబు కరుణంజేసి పెద్దకాలం బిమ్మహాదేవి సంతానలాభంబు దూరం బగుట కారణం బుగా శయనాసనపానభోజనవిభూషణపరిధానాది సముచితవ్యాపారంబులు పరిజన ప్రయత్నంబునం బ్రతిదినంబు నెట్టకేలకు నిర్వర్తించుచు దేవరకు హృదయవేదన గావింపనోపక యనవరతంబుఁ దోఁపకుండఁ జరియించుచున్నయది నిన్నటి రేపు తపనమండలంబు కుపితకపికపోలక్రోశతామ్రం బై యుదయగిరికవాటవిటంకంబు నలంకరింప వింధ్యాచలనితంబబింబంబునకు మణిమేఖలాకలాపంబునుం బోలిన నర్మదాప్రవాహంబునం గ్రుంకి యోంకారేశ్వరు శశాంకశిఖాలంకారు హేమపంక జంబులం బూజించి గుడికిం బ్రదక్షిణంబుసేయునది దేవభవనప్రాకారగోపుర ప్రఘాణంబునం బౌరాణికుండు మహాభారతంబు వక్కాణించుచుం గథానుకథన ప్రసంగంబున నపుత్రకులకుఁ బుణ్యలోకంబులు లే వని పలికిన నప్పలుకులు నెమ్మ నంబునం గీలుకొని వాలంపములికియుంబోలె వేదన యుత్పాదింప భవనంబునకు వచ్చి యేకాంతంబ యిచ్చోట నవిరళబాష్పధారాదుర్దినాంధకారితముఖ యయి యీదుర్దశం బొంది యున్నయది యనుటయు. ౩౦

గీ. మంత్రియొకముహూర్తమాత్రంబు చింతించి, యుష్ణదీర్ఘ మైన యూర్పు నిగుడ
నెంతచింత దీని కిది మహాబలవంత, మేమిసేయవచ్చు నిందునదన. ౩౧

ఉ. ఊరక కుంద నేమిటికి నోంకృతినాథుఁడు నర్మదానదీ
తీరనివాసభక్తజనదివ్యమహీరుహమున్ సదాశివున్
(?)సారసనేత్రతత్పదపరిష్ట యభీష్టశుభాభివృద్ధికిం
గారణ మాఁటెఱుంగ వె వికారము దక్కు భజింపు శంకరున్. ౩౨

గీ. ఈశ్వరుం డద్రిజానాథుఁ డిందుమౌళి, కరుణ లేకను సుతుఁ డెట్లు కలుగ నేర్చుఁ
జంద్రచందనచంద్రికాశైత్య మైన, పుత్త్రపరిరంభసౌఖ్యంబుఁ బువ్వుఁబోణి. ౩౩

గీ. గురుజనంబుల సేవింపు కువలయాక్షి, కమలలోచన ముక్కంటికరుణఁ జేసి
మున్ను గురునుపదేశంబు మొనయఁ గాంచి, రభిమతార్థంబులెందఱే నబ్జవదన. ౩౪

వ. సర్వజగత్ప్రసిద్ధంబు గదా యితిహాసంబు తొల్లి చండకౌశికువరప్రసాదంబున మగ ధాధిపతి యగురాజు దైతేయకులవిమర్దను గెలువం దగినయట్టిశౌర్యనిధి జరాసం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ధుం గాంచె దశరథుండు విభండకతనయు నారాధించి దిగ్గజంబులం బోలినకుమారుల సకలలోకహితంబుగా నలుగురం బడసె సమారాధితగురుదేవతా ప్రార్థనవశంబున. ౩౫

గీ. వెలఁది పుత్త్రోదయారంభ వేళయందు, నిన్ను నెన్నఁడు చూతునో కన్నులార
విమలచంద్రోదయారంభ వేళయందుఁ, బూర్ణిమాయామినినిఁబోలెఁబుణ్యగరిమ.

వ. దేవి శోకంబు విడువు ధైర్యం బవలంబింపు ధర్మంబు నడుపు దానంబు సేయుము వ్రతంబులు సలుపుము సత్యంబు పలుకు మనపాలిదేవతలు మన కభీష్టలాభంబుఁ బొందింపఁగలవారు భవ్యసంతానలాభంబున సంతోషంబు వహింపంగల వని దుఃఖోపశమనభాషణంబులు ధర్మోపదేశగర్భంబులు చారుమధురంబు లగుమాటల నూరార్చి కాంచనకలశోదకంబులు కరపల్లవంబున ధరియించి నయనంబులు దుడిచి యగ్గజయానకు ముఖప్రక్షాళనం బాచరించి మందీభూతదుఃఖ యగుట యెఱింగి మంత్రి యంతఃపురంబు వెడలి సముచితవ్యాపారంబులం బ్రవర్తిల్లె నది యా(ది)గ (నాగ) మోక్తప్రకారంబున సభక్తివినయతాత్పర్యంబున. ౩౭

ఉ. ఆధవళాయతాక్షి వసుధామరకోటి భజించు దేవతా
రాధన మాచరించు మునిరాజి కుపాస్తి యొనర్చు మంత్రవి
ద్యాధృతబుద్ధిఁ గాంచుఁ గొనియాడును యోగిజనంబు వర్ధమా
నాధికభక్తిభావమున నాత్మజసంతతిలబ్ధికామనన్. ౩౮

గీ. ఎఱుఁగునే నీడకన్నును నెండకన్నుఁ, జెలఁగి పూఁచు నేకర్మ వంచిన లతాంగి
యెట్టిక్లేశంబులకునైన నీసఁబోదు, తనమనంబుననిగ్రుచుసంతానకాంక్ష. ౩౯

సీ. భక్తితో మాతృకాభవనంబులకు నేగుఁ గావించు నతిథిసత్కారములను
వాయసంబులకు నిర్వర్తించు దధిబలిఁ గొలుచు జ్యేష్ఠాదేవి నలఘుమహిమఁ
జదివించికొనుఁ బుణ్యసంహితావ్రాతంబు మూలికామాణిక్యములు ధరించుఁ
దనవ్వంగి గంధాక్షతలు చిరంటుల కిడు విప్రశ్నికల గారవించుఁ దఱచుఁ
గుమ్మరావంబుకడవలు క్రొల్లవిడుచు, బాలురకుఁ జియ్యపండులు పంచియిచ్చుఁ
జెలులుఁదానునువ్రతములునలుపుచుండుఁ, దామరసనేత్రపుత్త్రసంతానకాంక్ష.౪౦

వ. ఇవ్విధంబునఁ బుణ్యోపవాసవ్రతదానధర్మదేవతారాధనంబులఁ బ్రతిబంధదోషంబులు వాసిన నానుదతీలలామంబు మెఱసి ప్రతిమాచంద్రబింబంబు నరసియందునుంబోలె గర్భం బావిర్భవించిన ౪౧

సీ. అభ్యంతరస్థాగ్ని యగుశమీలతవోలె నిధిగర్భ యగునబ్ధినిలయవోలె
నంతస్థనదిద్దంతి యగువియన్నదివోలె శశికుక్షి యగునస్తసంధ్యవోలె

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాలీకహర్యక్షు యగునద్రిగుహవోలె వీణధారిణి యగువినతవోలె
నస్త్రాంతరిత యగునలినాప్తరుచివోలె సూనృతాభిధ యగుసూక్తివోలె
నాదిమబ్రహ్మసంభరితోదర యగు, కైటభారాతినాభ్యబ్జకమునుబోలె
నధిగతాగస్త్య యగుదక్షిణాశవోలెఁ, బ్రథమగర్భంబు ధరియించెఁ బల్లవోష్ఠి. ౪౨

గీ. పలుచఁబాఱెను గండదర్పణయుగంబు, నవమధూకప్రసూనంబు నవమధుకర
మానుగతిఁజూచుకంబులునసితమయ్యె,నవతిపూఁబోండ్లయానవాబ్జములతోడ. ౪౩

చ. ననమున కుత్సవం బొసఁగె మంత్రికిఁ బట్టపుదేవి గర్భశో
భనమునఁ బల్చనై చెలువు పైకొనుముద్దులనెమ్మొగంబుతో
ఘనసమయంబునందుఁ బొడకట్టిన చల్లని తూర్పుగాలిచే
ననిచినకన్నెగేదఁగికి నచ్చినకూరిమిచుట్టమో యనన్. ౪౪

గీ. గర్భభారాలసాంగియై కంబుకంఠి, చెవిశిరీషప్రసూనంబు చేర్పనోప
దెట్లు ధరియింపఁగా నోపు హేమరత్న, కంఠికాహార కేయూరకటకములను. ౪౫

క. ఎలదోఁటతీఁగెయుయ్యెల, కలకంఠికిఁ జిన్ననాఁటికతలై తోఁచెం
జెలువకుఁ బాదాంబుజములు, గిలిగింతలు గొలుపుఁ గేలిగిరిగుహలందున్. ౪౬

శా. ఆసారంగవిలోలలోచనను గాఢాలింగనక్రీడల
న్వాసాగారము కేలితల్పముపయి న్మన్నించి మంత్రీశుఁ డ
త్యాసంగం బొనరించె ముద్దుగొనె మృత్స్నాస్వాదనప్రక్రియా
వ్యాసంగంబునఁ గమ్మనైనయదసీయంబైనబింబోష్ఠమున్. ౪౭

క. జలరుహనాభునివక్ష, స్థలికౌస్తుభమునను దీప్తిఁ దనరెడుమణిరా
ట్కలికాలంకృతిఁ బోలెం, బొలఁతుక ప్రత్యగ్రగర్భమున నొప్పారెన్. ౪౮

వ. ప్రతిదివసోపచీయమానగర్భనిర్భర యగుచు నయ్యది కౌముదీవిలసనంబునుంబో
లెఁ బ్రియసఖీవిలోచనచకోరికలకుఁ గోరికలు నిండించె వెండియు. ౪౯

చ. బహుదినముల్ మహాసచివుపట్టపుదేవికి వృద్ధిఁబొందె దు
స్సహనవగర్భచిహ్నములు చూచి(?) సఖుల్ ప్రియమందఁగా ముహు
ర్ముహురనుబద్ధజృంభితసముద్గతవిహ్వలనేత్రపద్మముల్
జహదజహత్సమగ్రపురుషాయిత కేలివిజృంభణంబులున్. ౫౦

గీ. అట్లు ధవునొద్ద మెలఁగుఁ బద్మాయతాక్షి, సముదితం బైనగర్భభారముకతమున
సమ్యగాపీతజలరాశిసామ్య మైన, ప్రావృడారంభనవమేఘపంక్తివోలె. ౫౧

శా. సీమంతోన్నతసంభ్రమంబు వెలయం జేయించె శ్రీయజ్ఞద
త్తామాత్యాగ్రణి కన్నుపాలకుఁడు వింధ్యాధీశ్వరుం డర్మిలి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

న్నానుమంతక్షితిపాలమంత్రు లనమానం బైనప్రేమంబునన్
భామాసింధుతురంగరత్నములు పైపైఁ బావడల్ తేఁగన్. ౫౨

సీ. కమ్మగొజ్జఁగనీటఁ గలయంపిచల్లిరి మేఁగి మెత్తిరి క్రొత్తమృగమదమున
రంగవల్లులు కప్పురపుమ్రుగ్గు వెట్టిరి కీలించిరొగిఁ మాల్యతోరణములు
తరుణరంభాతరుస్తంభంబు లెత్తిరి కట్టి రెల్లెడఁ బట్టుకలునడములు
కమలచందనమాలికలును నిర్మించిరి స్తంభించి రుత్తమదర్పణములు
నాలిఖించిరి గేహకుడ్యములయందు, సర్వతోభద్రనుకరికాస్వస్తికములు
పరిజనంబులు రాజాజ్ఞఁ బట్టనమున, యజ్ఞసత్త్రుని ప్రథమకళ్యాణవేళ. ౫౩

గీ. వేశ్య నృత్యంబు లాడిరి వీథులందుఁ, బాడి రెత్తిలి పికకుహూపంచమమునఁ
బంజళంబున ధవళప్రబంధగీత,[1]కముల నవ్వేళఁ గర్ణాటకమలముఖులు. ౫౪

మ. అదనన్వచ్చిరి సంభ్రమంబునను బంచారామలీలావతుల్
పదునాల్జాతులయప్సరోఽంగనలునుం జాలిండ్లపై హారముల్
గదలం బెన్నెఱిసేనకొప్పులపయిం గల్హారగుచ్ఛంబు లొ
ప్పఁ దదీయత్వర గండభాగములఁ గంపఁబొందఁ దాటంకముల్. ౫౫

సీ. పూజెకుండలు నిల్పెఁ బువ్వుఁబోఁడి యొకర్తు శుభవితర్దికచతుష్కోణములను
జాజాలపాలెల [2]సర్వౌషధులు నించి ప్రోక్షించె నొక్క పద్మాక్షి జలము
కాంతయొక్కతె సన్నెకలుఁ బొత్తరంబును దోరించె వటశాఖతోడఁ గూడఁ
బీఠకంబులు వెట్టి బింబోష్ఠి యొక్కతె [3]మడుఁగుఁబట్టముగప్పెనడుగుమునుఁగ
రమణియొక్కతె వింజామరంబుదాల్చెఁ, దరుణియొక్కతె తాళవృంతంబుపూనె
లలనయొక్కతె పసిఁడిసంబెల ధరించె, నాలవట్టంబు ధరియించె నతివయోర్తు. ౫౬

గీ. మంత్రి వేల్పించెగృహ్యోక్తమార్గమొప్ప, బ్రహ్మపదమునఁ గూర్చుండి బ్రాహ్మణుండు
హోమములు రెండుబుగ్యజుస్సామ వేద, మంత్రమాదిజయాదిహోమంబుతుదగ. ౫౭

మ. చెవికిం గేలివతంసనోత్పలదళశ్రీలై కపోలంబులన్
నవకాలాగరుపత్రరేఖలయి మేనం గమ్మకస్తూరియై
ధవళాంభోరుహనేత్రపైఁ గురిసె నుద్యల్లీల సీమంతపుం
నవనాజ్యాహుతిహోమసంప్రభవచంచద్వహ్నిధూమచ్ఛటల్. ౫౮

మ. చెలికత్తెల్ చిఱునవ్వు చెక్కులపయిం జెల్వార వీక్షింప నొ
జ్జలు మంత్రంబులు సెప్పఁ బ్రెగ్గడ శరత్సంపూర్ణచంద్రాస్యకున్

[1] కనుమయవ్వేళికర్ణాట - మూ. [2] సర్వౌషధులు చిలికించె నొక్క పద్మాక్షి జలము - మూ. [3] మణుంగు బట్టము గప్పె నరుంగుమునుంగ. మూ.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వలిచన్నుంగవమీఁద ముత్పులకముల్ వర్ధిల్లఁ గేల్వంచుచున్
శలలీకంటక మెత్తి యాదలవయిన్ సంధించె సీమంతమున్. ౫౯
క. కుటిలాలకకును నాసా, పుటరంధ్రముఁనందు మూఁడుబొట్టులు పిడిచెన్
వటఫలదళరస మధిపతి, కటకఝుణత్కార మెసఁగఁ గరపద్మములన్. ౬౦
గీ. మృదులగోధూమసరులతో మేలవించి, వన్నెకుచ్చులవేరుతో వక్కరించి
పువ్వడుండుభకంబుతోఁ బొత్తువచ్చుఁ, బడఁతిపాలిండ్లపై నొప్పు పసిఁడిపేరు. ౬౧
గీ. తగవు లిచ్చిరి పుట్టింటితల్లిప్రజలు, పీల్లొసంగిరి చుట్టాలు వేనవేలు
కట్న మిచ్చె నృపాలుండు కన్నుదనియఁ, బరమహీపాలు రిచ్చిరి పావడములు. ౬౨
సీ. క్ష్మామండలము తురంగమఘట్టమయ మయ్యెఁ గరిమయం బయ్యె దిక్చక్రవాళ
మంబరం బాతపత్రావళిమయ మయ్యె సౌరభమయ మయ్యె మారుతంబు
పరివారమయ మయ్యె బ్రహ్మప్రపంచంబు జయశబ్దమయమయ్యె సకలజగము
లాతపత్రవిభూషణాలోకమయ మయ్యె సంతోషమయ మయ్యెజనులమనను
వింధ్యపర్వత మేలుపృథ్వీవరుండు, దానుఁ బట్టంపుదేవియుఁ దగవుగలిగి
సచివునింటికి నేతెంచి సమ్మదమున, నొద్దనుండి యాశోభన మొనరుచుటయు. ౬౩
గీ. జవిలైనరఁబూలుముడిచినసాధ్వియొకతె, యుల్లగందంబుపసుపునూన్పెఁగదిసి
పసిఁడియుత్తరజందెముల్ పాయఁబట్టి, రాచప్రెగ్గడబ్రహ్మసూత్రమున నగుచు. ౬౪
గీ. దశరథునివాజపేయంబు ధర్మసూను, రాజసూయంబు నుపమింపఁ బ్రాఁతియెయని
పట్టనంబును దేశంబుఁ బరిఢవింపఁ, బెట్టె దొడ్డుగ నామెత ప్రెగడగారు. ౬౫
వ. అంత. ౬౬

## సుకుమారుని జననము.

క. నవమాసంబులు నిండిన, ధవళేక్షణ గాంచె సుతు సుధాకరతారా
రవిసుతధిషణవిధుంతుద, (?)కవులుభికములుగ నవమఘటికలు నడువన్. ౬౭
వ. ఇవ్విధంబున సుశీలాదేవి నందనుం గాంచినవార్త యంతఃపురపరిచారిణి యొకర్తవి
న్నవించిన నమృతరసధారామయం బయినయమ్మాటకు సద్యఃప్రరూఢరోమాంకు
రనికరకంటకితగాత్రుండును దరస్మితవికసితకపోలమండలుండునునై మంత్ర్యాఖండ
లుండు:—
గీ. తాను గట్టినట్టిచీనాంబరంబులుఁ, దాను బెట్టినట్టిమేనితొడవుఁ ౬౮
బ్రమదమొప్పనిచ్చెఁ బారితోషికముగ, మంత్రి యంతిపురముమానవతికి. ౬౯
సీ. తలయంపి ధవళనిద్రాకుంభ మిడువారు రక్షాభసితరేఖ వ్రాయువారు
గౌరసర్షపరాజి కలయఁ జల్లెడువారు బలివిధానంబులఁ బరఁగువారు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లవణంబు నింబపల్లవముఁ ద్రిప్పెడువారుఁ బ్రేము మంచంబుతోఁ బెనఁచువారు
గవలధూపంబు సంఘటియించువారును మంచిము బ్లైడఁద యోజించువారుఁ
గదిసి దీవించువారును గండతైల, మందుకొనువారుఁ గాయంబు లందువారుఁ
బాడువారును బరిహాస మాడువారు, నైరి శుద్ధాంతసతు లరిష్టాలయమున. ౨౦

సీ. కర్పూరసమ్మిశ్రగంధసారంబునఁ జలిచెఁ జప్పట భిత్తిఁ జామయొకతె
వెలకిల్లఁ బెట్టె నుత్పలగంధి యొక్కర్తు కప్ప గర్భగృహోపకంఠభూమి
జ్యేష్ఠాధిదేవత సేవించె నొకయింతి పసుపుఁబుట్టము గట్టి భక్తిగరిమఁ
బటముపై లిఖయించెఁ బాటలాధరయోర్తు క్రొత్తలత్తుక శశాంకుని ఖరాంశు
జరతమేషంబుకంఠదేశమునఁ జుట్టెఁ, బుప్పడుండుభముల నొక్కపువ్వుఁబోఁడి
యంబుజానన యొకతె నెయ్యభిఘురించె, భుజగనిర్మోకమొకతెనిప్పులఁగమర్చె. ౨౧

ఉ. మంగళరత్నదీపములమధ్యమునం బురుటింటిపాన్పుపై
నంగజసన్నిభుండు సచివాగ్రణినందనుఁ డొప్పె నెంతయున్
నింగిఁ బ్రదోషవేళ నతినిర్మలతారకచక్రవాళముల్
సంగతిఁ జుట్టునుం గొలువఁ జాలఁగ నొప్పుశశాంకుకైవడిన్. ౨౨

గీ. బాలకుఁడు చంద్రచంద్రికాపాండు వయిన, పాన్పుఁబొత్తులపై నొప్పెఁ బవ్వళించి
యమృతవారాశిలోన శేషాహిమీఁదఁ, బవ్వళించినకౌస్తుభాభరణుఁబోలి. ౨3

గీ. దానధర్మంబు లొనరించి త్యాగ మిచ్చెఁ, బ్రసవగేహంబు సొచ్చి భూపాలమంత్రి
యప్డు పావకసంస్పర్శ మాచరించి, ప్రథమతనయముఖేందుబింబంబుచూచె. ౨౪

గీ. పురుడుచెల్లంగఁ బుణ్యాహమునునొనర్చి, నిలయదైవతములఁగొల్చి నిజసుతునకు
మారసన్నిభునకు సుకుమారుఁ డనెడి, పేరు వెట్టెఁ బ్రధానబృందారకుండు. ౨౫

గీ. పసుపుఁబుట్టంబుధరియించిపద్మనయన, సుతునినుత్సంగమునఁదాల్చిచూడనొప్పెఁ
దరణిబింబహారిద్రవార్ధ(ర)ముతోడ, లలితరుచి నొప్పునాకాశలక్ష్మివోలె. ౨౬

గీ. పల్లవాధర మడుఁగైనయొల్లెఁ గట్టి, కొంగు మణిహేమకంఠికాకోటిఁ జెరివి
సొబగుఁగాటుకబొట్టుతోఁజూడ నొప్పె, వింతచెలువునఁ బచ్చిబాలెంతయపుడు.

ఉ. అక్షయవర్ణితాఖ్యుఁడు గరంబు(?) సువర్ణలతానిబద్ధముల్
వక్షమునన్ ధరించి సచివప్రియసూనుఁడు చూడనొప్పె ను
గ్రక్షితిసంభ్రమోద్ధతిని గాండివధన్వనితండ్రి యా సహ
స్రాక్షునివైరి పేరురమునందు ధరించినదైత్యుకైవడిన్. ౨౮

గీ. రత్నవేదికపై మంత్రిరాజసుతుఁడు, తల్లిహృదయంబు దృష్టులు తన్నుఁగొలువ
సకలజనులును బంధులు సంతసింప, జానుచంక్రమణక్రీడ సంచరించె. ౨౯



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మ. వలిచన్నుల్ వడఁకాడ వేనలులు గ్రైవ్రాలంగ గారాపుదా
దులు త న్నేమఱ కంతలంతలను (?) వేడ్కల్ మీఱి చూడంగఁ దాఁ
గలకాంచీమణికింకిణీకలకలాత్కారంబు తోరంబుగాఁ
గలహంసంబులఁ బట్టఁ బాఱును వడిం గత్యావిభాగంబులన్. ౮౦

వ. అంత నాసుకుమారుండు నత్యంతసంతోషవంతు లగు తల్లిదండ్రుల మనోరథంబు
ఫలియింప ననుదినప్రవర్ధమానుండై - - - వర్ధమానసంపదనురూపంబుగఁ గు
మారరత్నంబునకుఁ గ్రమక్రమంబునఁ - - - జౌలోపనీతుండై కుమారుం డాచార్య
గృహంబున కరిగి. ౮౧

సీ. చదివె వేద మెఱింగె పదమువక్కాణించె మహనీయదివ్యాగమములు చూచెఁ
దరచె నాదిపురాణధర్మశాస్త్రంబులు నేర్చె వీణావేణునృత్యకళలు
వాదవశ్యాంజనవదనికాదులు జూద మాడంగ నెఱిఁగెను మదనశాస్త్ర(?)
నరహస్యముగ నింద్రజాలంబుయంత్రక్రియామంత్రతంత్రచిత్తరువుపరచె(?)
గ్రోల్చె యోగంబు సాధించె రుద్రభూమి, సకలశస్త్రాస్త్రసంచయసమితినేర్చె
నాకళించెను విపులవైద్యక్రమంబు, సంగ్రహించెఁ గవిత్వంబు సచివసుతుఁడు. ౮౨

వ. ఇవ్విధంబున సర్వవిద్యాపరిశ్రమంబునఁ బారీణుండై యుండునక్కుమారునకు శై
శవంబు సరిగడచుటయుఁ బ్రదోషంబునకుఁ జంద్రోదయంబును జలధరంబునకుఁ
జక్రవాకంబును బుష్పంబునకు వాసనాప్రకారంబును గమలవనంబునకు సూర్యో
దయంబును గంధగజంబునకు దానంబును విజ్ఞానంబునకు మానంబును నవధ్యునకు
గేయంబును రాజ్యబలంబునకు నాజ్ఞాబలంబునుంబోలె భువనసమ్మోహనం బైన
సౌందర్యంబున కనురూపం బై జవ్వనం బావిర్భవించిన. ౮౩

గీ. బాల్యమునయందుఁ గలుగుసౌభాగ్యరేఖ, నినుమడించినసౌందర్యమెసక మెసఁగ
సచివతనయుండు తా నొప్పి చారులీలఁ, బౌరజనులకుఁ గన్నులపండువయ్యె. ౮౪

శా. పంచారామవిలాసినీధవళదృక్పాతీనజాలాయమా
నాంచత్కారము నిర్నిబంధనమనోజ్ఞాకార రేఖా....
పంచాస్త్రం డగునాకుమారకుఁడు దర్పస్ఫూర్తి నవ్వీటిలో
సంచారం బొనరించెఁ గాంచనమహాసౌధాగ్రభాగంబులన్. ౮౫

గీ. ఆదిగర్భేశ్వరత్వంబు యావనంబుఁ, జక్కఁదనమును నతిసాహసంబుఁ జనవు
నొక్కఁడొక్కండుచాలుదోషోత్కరమున, నన్నియునుగూడియున్నవి యతనియందు.

సీ. ఒకకొంతప్రొద్దుకందుకకేళి యొనరించుఁ గంకణంబులఝణత్కార మెసఁగ
నొకకొంతప్రొద్దు వల్లకి నఖాగ్రంబుల బహురాగములనేర్పుఁ బ్రస్తరించు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నొకకొంతప్రొద్దుభాండికజనంబు లొనర్చు పరిహాసగోష్ఠికిఁ బల్లవించు
నొకకొంతప్రొద్దు లోకకథాప్రహేళికాబిందుమత్యాదులఁ బిచ్చలించుఁ
గొంతప్రొద్దు వినోదించుఁ గొఱఁతలయిన,తోడివేడుకకాండ్రతో మేడమీఁద
విమలచంద్రోదయారంభవేళయందుఁ, బిల్లదీవాటలను మల్లుపెనఁగుటలను. ౮౭

వ. ఇవ్విధంబునఁ దృష్ణావిషవల్లి కాలవాలంబును నింద్రియగుణంబులకు శరణంబును మోహనిద్రకు విభ్రమశయనంబును శాస్త్రదృష్టికిఁ దిమిరోద్గమంబును దోషాశీవిషంబులకు నావాసవల్మీకంబును సుగుణకలహంసంబులకుఁ బ్రావృట్కాలంబును గపటనాటకంబునకుఁ బ్రస్తావనయు ధర్మేందుమండలంబునకు రాహువక్త్రంబు నైనయౌవనారంభంబున. ౮౮

సీ. ఆజానుదీర్ఘబాహార్గళస్తంభుండు కోమలాళివినీలకుంతలుండు
కర్ణాంతవిశ్రాంతకమలాయతాక్షుండు పరిఫుల్లచంపకప్రసవకాంతి
బహుళాష్టమీశశిప్రతిమఫాలతలుండు కంబుసన్నిభచారుకంధరుండు
పరిపక్వబింబికాపరిపాటలోష్ఠుండు గంధవారణకుంభకఠినభుజుఁడు
సచివతనయుండుకుపితధూర్జటిలలాట,చక్షురనలార్చిరుద్గమసంప్రభూత
విస్ఫులింగచ్ఛటావలీవేష్టనమునఁ,బసిమి దప్పని వలరాజుపగిది నొప్పె. ౮౯

సీ. సరి గొన్న వెలిపట్టు జన్నిదంబులతోడ రత్నాలతారహారము ధరించి
వలిపనీర్కావిదోవతిపైఁ బదార్వన్నె కళ,యైనపసిఁడిమేఖల ఘటించి
గంగమట్టియమీఁదఁ గస్తూరిరసమునఁ బుండ్రకంబు లలాటమున నమర్చి
కమలకర్ణిక కుండలములపార్శ్వములందు లలితంబు లగునొంటు లలవరించి
యాత్మవంశపరంపరాయాత మైన, వైదికాచారమార్గంబు వక్కణించి
యారజము రాచఱికమును నలవరించి, నగరివీథులఁజరియించుఁబ్రెగడసుతుఁడు.

గీ. సచివనందను కర్ణపాశముల వ్రేలు, కుండలంబులముత్యాలగుళిక లొప్పు
నన్యలోకస్థుఁ డగుశంబరారి కేడ్చు,రతిమహాదేవియశ్రుపూరములువోలె. ౯౦

క. కుసుమాయుధనిభుఁ డగునా, రసికునిపైవ్రాలు సానురాగముతోడన్
బిసరుహనయనలచూపుల, భసలంబులు పూవుఁదోఁటపయి వ్రాలుగతిన్. ౯౧

గీ. భావ మభిరామరూపైకపాతకంబు, యౌవనము దోషముల కెల్ల నాస్పదంబు
మన్మథుఁడుకోపి యెటునియమంబునిలుచు,సుదతులకు వానిఁగడకంటఁ జూచినపుడు.

సీ. హృదయ ముప్పొంగార నేకాంతమున నుండి వానిఁ జింతింపని వనజముఖియు
నొకమాఱతనిఁ జూచియొండొక్కమరిచూడ నభిలషింపనివిద్రుమాధరియును
గలలోన వానిఁ జిక్కఁగఁ గౌఁగిటను జేర్చి ముకుళితేక్షణగానిముద్దియయును
నతనిరూపంబుఁ గుడ్యంబులందు లిఖించి యందంబుఁ జూడనియంగనయును

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

జెలులచేతను బ్రోదిరాచిలుకచేత, వానిగుణములు విని కుచద్వంద్వసీమఁ
బాదుకోఁ బులకింపనిపైదలియును, బన్నిదము వ్రేసినను లేదు పట్టనమున. ౯౪

సీ. ద్యూతకేళియ వినోదోపాయమయ్యెను బరదారగమనంబు ప్రౌఢియయ్యె
నాత్మభార్యాపరిత్యాగంబు ధృతియయ్యెఁ జేలవిహారంబు సేసమయ్యె
గురుతిరస్కారంబు గరిమ మయ్యెను నటవిటకీర్తనంబులు పటిమమయ్యెఁ
బానంబె యధ్యాత్మపరత యయ్యె సమస్తతరలతాగతియ యుత్సాహమయ్యె
గుణములకు నెల్లదోషంబుగుణమునయ్యెనపుడుసుకుమారునకుఁదద్వయస్యులకును
నాదిగర్భేశ్వరత్వంబుయౌవనంబు, సవురు ధనమును జనవు హేతువులు గాఁగ. ౯౫

గీ. తమ్మమానుష కాలోచితంబులైన, కీర్తనంబుల మై పులకించుకొంద్రు
తా రమర్త్యులుగా మదిఁ దలఁతు రహహ, విత్తమదమత్తచిత్తులై వెఱ్ఱిజనులు. ౯౬

సీ. అయ్య నీవు చతుర్భుజావతారుఁడ వన్నఁ దమభుజాదండపార్శ్వములఁజూతు
రయ్య నీవు త్రిలోచనావతారుఁడ వన్న ఫాలమంటుదురు దోఃపల్లవమున
నయ్య నీవు గజాననావతారుఁడ వన్నఁ గుంభపీఠము లంటికొనఁ దలంతు
రయ్య నీవు చరాచరావతారుఁడ వన్న నందంబుఁ జూడంగ నభిలషింతు
రవసరంబిచ్చుట యనుగ్రహంబుగాఁగ, మోముఁజూచుట యుపకారముగను బలుకు
మైత్రిగా నప్పు డధికత(?)రార్థముగఁ ద, లంతు రైశ్వర్యమదబలవంతు లుబ్బి ౯౭

ఉ. సంపదపేరి కట్టిఁడిపిశాచము సోఁకినమానవుండు పూ
జింపఁ డభీష్టదేవత భజింపఁడు సజ్జనులైనవారి మ
న్నింపఁడు మిత్రబంధుల గణింపఁడు ధర్మరహస్యముల్ విచా
రింపఁడు మీ..... భరింపఁ డహంకరణంబు పెంపునన్. ౯౮

గీ. ఉద్ధతుం డయి సుకుమారుఁ డుండలేక, వీటఁ జక్కనిజవరాలి వెదకి వెదకి
వలపు పుట్టించి సంకేతములకుఁ దార్చి, చలుపు రతికేలి బహుళపక్షంబు రేలు. ౯౯

గీ. పద్మనాభుండు మదనగోపాలమూర్తి, ఘోషమున నెట్లువలపించె గొల్లసతుల
నెట్టుకొని యట్లు వింధ్యాద్రిపట్టనమునఁ, బరపురంధ్రులవలపించు బ్రాహ్మణుండు.

సీ. యమునానదీసైకతమున జాలరికన్యచనుదోయి నంటఁడే శక్తిసుతుఁడు
నందవ్రజంబులో నలిననాభుం డెట్లు విహరించెఁ బదియాఱు వేలసతుల
దేవదారువనంబులో విరూపాక్షుండు మునిభామినుల నెట్లు మోసపుచ్చెఁ
గొక్కొరొకో యని కోడియై మెలుఁగించియమరనాయకుఁడెట్లహల్యఁ గలసె
మొలకచన్నుల పాయంపుముద్దుఁగూఁతుఁ, బట్టుకొనె నెట్లు పైకొనిపద్మభవుఁడు
చందురుం డెట్లు వొందెనాచార్యులేమ, ననుచు విప్రుండు రమియించు నన్యసతుల.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

సీ. సంధ్యాభివందనశ్రద్ధ యుద్వాసించె గాయత్రి దవ్వులఁ గట్టిపెట్టె
నగ్నిహోత్రము మీఁదియాస నుత్పాటించె నఘమర్షణస్నాన మరసి మాపె
నిహపరసామగ్రి నీయఁ జాలెడునట్టివిధి దేవతార్చన వీటఁబుచ్చె
వేదపాఠము మాని వివిధసత్కర్మాదిసత్కలాపంబులు జాఱవిడిచెఁ
దనకు మరగినవారసుందరవనితల, నిరతసల్లాపసంభోగనిపుణతాను
ఖానురాగనిమగ్నుఁడై నిత్యకర్మ, మైతనర్చెనుసుకుమారధరణిసురుఁడు.(?) ౧౦౨

వ. ఇవ్విధంబునఁ గుమారుండు విహరింపంజూచి. ౧౦౩

క. ప్రేమమునఁ గూర్చి సుతునకు, వేమఱు సద్బుద్ధి చెప్ప వినమికి వగచున్
సామగ్ర్యదుర్గుణాళి క, దా మధురత యొసఁగువిషమమగుచలమునకున్. ౧౦౪

గీ. జవ్వనమునను సదుపదేశములు గావు, తిల - - - - లంబు తెఱఁగుదోఁప
శంబరారాతిపుష్పాస్త్రసంప్రహార, జర్జరీభూత మగుమనస్సంపుటమున. ౧౦౫

వ. తండ్రి గురూపదేశం బఖిలమలప్రక్షాళనక్షమం బైనతీర్థస్నానంబు, జరామరణవై కల్యంబు లేని వార్ధకంబు, మేదోభారంబు లేని గౌరవంబు సువర్ణరచన లేని కర్ణాభరణంబు, నుద్వేగంబు లేనిప్రజాగరంబు. ఇది యభవ్యులకుసలిలంబునుం బోలెఁ గర్ణస్థితం బై యుపద్రవంబు నాపాదించు. నీవిటువట్టి నెట్టుకొని పెద్దలమాట వినుము, వింటేని ధూర్తులు నిన్నుఁ బ్రశంసింపలేరు, కుటిలులు ని న్నలమరింపలేరు, వంచకులు నిన్ను వంచింపలేరు, పల్లవులు నిన్ను వలపింపలేరు, మదంబు నిన్నుఁ గదల్ప లేదు, విషయంబు నిన్ను నాశ్లేషింపలేదు, విను మనూచానాచారంబును, నాముష్యాయణంబును, నామేధితామ్నాయంబును, నధీతాశేషశాస్త్రంబును, నలింగవృత్తియు, ననపకీర్ణంబు, ననభ్యుదితంబును, ననభిస్తుతంబును, నైనయార్యవరవంశంబునం బ్రభవించినాఁడవు మాఘుండవై యనుష్ఠానబంధంబు లగువిషయోపభోగంబులయందును సుఖబుద్ధి యారోపించెదవు. నీయట్టిదుర్బుద్ధిశీలురు గదా నిస్త్రింశంబుఁ జూచి కువలయమాల యనియుఁ గృష్ణసర్పంబు వీక్షించి కాలాగురుధూమరేఖ యనియును నంగారంబు దర్శించి బంగారం బనియును భ్రాంతిఁ బొందుదురు. దుందుమారనముండు, మాంధాతృనహుషనాభాగసన్నిభుండు, వింధ్యాచలపతి, హేమాంగదుండు మనల గురుస్థానంబుగా మన్నించుచున్నవాఁడు. మనవంశంబునకు నీవొక్కండవ సంతానబీజంబ వింతయు నెఱింగి బుద్ధిమంతుండవై మమ్ము నుద్ధరింపవలవదా యని పలికి మంత్రి కన్నీరు దొరఁగ ముహూర్తమాత్రం బూరకుండె సుశీలాదేవియు. ౧౦౬

సీ. రవలయుంగరములరత్నాంకురము లొత్తఁ గేల్దమ్మి చెక్కులఁ గీలుకొల్పి
మొకరితుమ్మెద మూతిముట్ట నోఁజెడి వేఁడినిశ్వాసపవనంబు నివ్వటిలఁగ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నాకర్ణదీర్ఘంబు లగునేత్రాలుఁగన్నులఁ బరిపాటలచ్ఛాయ పల్లవింపఁ
గంఠగోళంబు గద్గదికానుబద్ధ మై బాష్పభారంబు నిబ్బరము గాఁగఁ
బక్ష్మముల జాఱి గండదర్పణము లొరసి,వ్రాలి పాలిండ్లపై నశ్రువాఃకణములు
హారలతలకు నాతిథ్య మాచరింప, గుబ్బతిల నేడ్చె నత్తఱిఁ గువలయాక్షి. ౧౦౮
వ. ఇవ్విధంబునఁ దల్లియుఁ దండ్రియుఁ దనకు హితోపదేశంబు చేసి తనసౌమనస్య
సౌముఖ్యంబులతోఁ దగినప్రత్యుత్తరం బీయమి నిర్వేదించుట యెఱింగి. ౧౦౯
సీ. ధర్మశాస్త్రాభ్యాసతాత్పర్యమున నైనసంస్కార మెట్లారుసారుపడియె
నిరుపాధినిస్సీమనిర్నిబంధనవృత్తిగలమహాప్రతిభ యేకాటఁ గలసెఁ
బంచేంద్రియోపాయపానభూతము లైనవినయంబు లేప్రయోజనముఁ దీర్చె
నవయౌవనాంకుశోన్నతవంశపద మైనశ్రుతివైభవము లేమిహితవుచేసెఁ
జిన్ననయసున గురులవీక్షించి నట్టి, పుణ్యవాసన నేల గోల్పోయె మనసు
కటకటా! నందనుండ వొక్కఁడవు నీవు, గురుల నేడ్పించుచున్నావు గోరముగను.
వ. (అనినఁ దల్లిదండ్రుల) కుం బ్రణామంబుచేసి యింతనుండి మీయాజ్ఞ శిరసున ధరి
యించి బుద్ధిమంతుఁడనై యుండెద మీరు వగవకుండుఁ డని పలికి సముచితప్రకా
రంబున వీడుకొనియె ననిన నటమీఁదివృత్తాంతం బెట్టి దని యడిగిన. ౧౧౦
మ. వరశైవైకనిధానపాత్ర కవితావ్యాపారపారంగతా
స్థిరలక్ష్మీనవశారదోదయ దయాధీనాయతాలోక లో
కరమాపాదన పాదపద్మవినతక్ష్మాపాలసంశీల శీ
లరతిప్రస్ఫుటశాంత శాంతనవకల్పద్వీర వీరాగ్రణీ! ౧౧౧
క. ధీమత్కవితావిస్తర, ధామాయితనిరుపమానదానాంబుదహృ
ద్భీమ జయోత్కలసీమా, రామామన్మథవిశేషరాజితమూర్తీ! ౧౧౨
పృథ్వి. లింగార్చనారూఢిలీలావతారా, గంగాంబునుస్వచ్ఛకావ్యైకజాలా
సంగీతసాహిత్యసాహిత్యలోలా, శృంగారసద్భక్తసేవానుహేలా. ౧౧౩
గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీ
నాథనామధేయ ప్రణీతం బయిన శివరాత్రిమాహాత్మ్యంబునందు ద్వితీయా
శ్వాసము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

తృతీయాశ్వాసము.

క. శ్రీదోరంతర వేద, ప్రోదితభాషావిశేషభాసురకీర్తి
శ్రీదార్ఢ్య వివిధపూజా, మోదితగిరిదుహితృకాంత ముష్మయశాంతా! ౧

వ. అక్కథకుండు శౌనకాదిమహామునుల కిట్లనియె నట్లు తల్లిదండ్రుల నూరార్చి
వెడలి సుకుమారుండు నిజాంతర్గతంబున. ౨

గీ. పోయె నుపదేశకాలంబు పూర్వమున నె,కడచె ధైర్యంబు జరరవిక్రాంతమయ్యె
శీలసంపత్తి యింక నేమిసేయువాఁడ, భామినీసక్తి మన్మథుబారిఁ బడితి. ౩

ఉ. పంతం బోడదు ధర్మముం దగవునుం బాడిం గులంబు న్విచా
రింతు న్వేదపురాణశాస్త్రమతపారీణుండఁ గానెట్లు క
ల్పాంతద్వాదశభానుమత్కిరణదాహక్రూరకామవ్యథా
సంతాపజ్వరవేదనాభరమునం జాకుంట సిద్ధించినన్. ౪

సీ. చాండాలుతోఁ బుల్కశత్వంబు గైకొను బ్రహ్మహత్య యొనర్చి బ్రాహ్మణుండు
క్రిమియై పతంగమై కీటమై జన్మించు నాసవం బాని భూమీసురుండు
క్రవ్యాదసత్త్వసర్గమున నుద్భవమందు విప్రుఁ డాచార్యునివెలఁదిఁ గవిసి
శ్యామచారుండు పిశాచమౌ బాడబుం డన్యునివిత్తంబు నపహరించి
యయిన నేమిగా వీనిలో నన్నిటికిని, సుఖము దుఃఖంబుఁ జర్చించిచూచినప్పు
డెల్లసంసారులకుఁగుందు హెచ్చు - - - -, లేకయుండుటగందుమో లేదొ జగతి.

గీ. వామదేవుండు శుకుఁడుఁ గేవలము దక్క, ముక్తులెవ్వరు వింటిమే ముజ్జగమున
జంతువుల కెల్ల సరియ సంసారయాత్ర, విధినిషేధంబులకుఁ జొప్పు వెదకనేల. ౬

ఉ. ఆతంకంబున కేమికారణము బ్రాహ్మ్యం బింతయుం జూచి యే
తాతలగట్టినచెర్వులే శ్రుతులు బోధప్రక్రియల్ స్వల్పమే
చేతోజాతు నుపాశ్రయించెదఁ బరస్త్రీల న్వినోదించెదన్
మాతంగీపరమేశ్వరిం గొలిచెద న్మద్యంబు సేవించెదన్. ౭

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అష్టమావతారంబున నాదిపురుషుఁ, డచ్యుతుఁడు విశ్వకర్త యనాదినిధనుఁ
డర్జునుంకును దాను నేకాంతగోష్ఠి, విశ్వమును నెఱుఁగమొ - - - - నిధిగా ౮
సంచెవింతము విధమతనిక్ గా భావించెఁ గాదె(?)

మ. బహువేదాంతమతానుసాధితమహాబ్రహ్మోహమం చాడుదుర్
మహిమోహాంధులు గొందఱేని యపెు బ్రహ్మం బెట్టు దా రెట్టిరో
యహహా బ్రహ్మము వారయే నలుకళయ్యం ద్రెళ్లి నిద్రింతురో
జహదుత్సర్గముగాఁగఁ జేయుదురొ విష్ఠామూత్రనిర్మోకముల్. ౯

సీ. కల్పద్రుమంబుతోఁ గామధేనువుతోడ నమృతాబ్ధినవతార మయ్యె నెద్ది
బృందారవనమధ్యమందారతరులలో హాలపాణి కెద్ది ప్రత్యక్షమయ్యెఁ
ద్రిపురాంతకుని యర్ధదేహంబునకు నెద్ది మదనసంఫుల్లసంపత్తి యయ్యె
నవసుధారూపమై పవనభుగ్భువనాధిపతి కెద్ది ప్రాణంబుప్రాణ మయ్యె
నట్టి భవభేషజము నాసవామృతంబుఁ, గన్నుఁగానకశిపియించెఁగాక యొకఁడు
తత్సమానము లగుపదార్థములు గలవె, భూతభావిభవత్కాలముల ధరిత్రి. ౧౦

వ. అని. ౧౧

సీ. కర్పూరరజములోఁ గలిపి కేతకిధూళి నఖిలాంగకముల నభ్యంగమాడి
జలజనాళీతంతుసందానితములైన యజ్ఞోపవీతంబు లఱుతఁదాల్చి
వారాంగనాస్తనహారవిభూషల నక్షమాల్యముగఁ జే నలవరించి
కస్తూరికామిశ్రగంధసారంబున నలికంబునఁ ద్రిపుండ్ర మనువుపఱిచి
చంద్రికావేళఁ బరిపాండుసౌధవీథి, శక్తిఁబూజించి దేవీప్రసాదమధువు
పుచ్చుకొనివిప్రుఁడాకంఠపూరితముగ, వెలఁదులునుదానునప్పుడువినిమయముల. ౧౨

క. వనితల కంగప్రభూ, ళన మక్షివిఘూర్ణనంబు లజ్జావిగమం
బనవస్థితి మధుపానం,బునకు సురతమునకు సదృశములు వక్రంబుల్. ౧3

గీ. త్రిసరకాస్వాదభవమదోద్రేకలహరి, ధరణిదేవుఁ డామోజ మత్తా వహించి
యారణాలుపఠింపంగ నాలకించి, శంబరారాతి రతిచేయి చఱచి నవ్వ. ౧౪

సీ. ఇంటనున్నాఁడొ వాఁ డెచ్చోటనున్నాఁడొయొంటిమో యెందఱే నున్నవారొ
మిన్నకున్నాఁడొ యేమేఁబల్కుచున్నాఁడొ నిద్రించినాఁడొ క న్దెఱచినాఁడొ
యాడుచునున్నాఁడొ - - - - గర్వించియున్నాఁడొ శోకించినాఁడొ
- - - - - - - యుత్సేకించి యుల్లాసించినాఁడొ కలంగినాఁడొ
యుత్సవమొ వైభవమొ లేమియో కలిమియొ
పగలొ రాత్రియొ యెఱుఁగఁ డాబ్రాహ్మణుండు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నవమధూకప్రసూనసంభవపుమధువు
దలము దప్పంగఁ ద్రావి మత్తావహించి. ౧౫

క. సుకుమారుఁ డిట్లు నానా, ప్రకరంబుల వీటిలోనఁ బడుచై తిరుగన్
సకలజనులు మొఱవెట్టిరి, యొకనాఁ డత్యాగ్రహమున నుర్వీశుసభన్. ౧౬

క. దేవరప్రతినిధిఁగా నం, సేవింతుము యజ్ఞదత్తు సిద్ధమ యతనిన్
భావింతుము తత్తనయుని, యావనసంప్రాప్తి లేనియటము న్నెల్లన్. ౧౭

వ. అవధరింపుము సుకుమారనామధేయుం డైనమంత్రినందనుండు సౌందర్యవంతుం డును గామశాస్త్రకళావిధిజ్ఞుండును నై జారచోరవిటధూర్తవర్గంబులంగూడి వేడుక కాఁడై పుణ్యస్త్రీల నిలువరుసఁ జెఱుచుచున్నవాఁ డతనివారింపను నారీజనంబుల శిక్షింపను సమర్థులము గాక యున్నార మద్దురాత్మకుని యన్యాయసదృశం బైనదం డంబువలన దండించునది యని విన్నవించిన మహీపాలుం డతని రప్పించి వాగ్దండ నంబున దండించి పురంబును దేశంబును వెడల నడిపించిన రాజావమానితుండై యప్పాపి కీ(క)టదేశంబునకుం బోయి యందుఁ గొన్నిదినంబులుండి మహాణమండ లంబునకు నేతెంచువాఁడు కాంతార మధ్యంబున నతిక్షుత్పిపాసాపరవశుండై తన లోన నిట్లు వితర్కించుచుండె. ౧౮

ఉ. అరుణగభస్తిబింబ ముదయాద్రిపయిం గనుపట్ట గిన్నెలోఁ
బెరుఁగును వంటకంబు వడపిండియలుం గుడువంగఁ బెట్టు ని
గ్భగకరుణాధురీణ యగుప్రాణముప్రాణము తల్లి యున్నదే
హారహార యెవ్వ రింకఁ గడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్. ౧౯

వ. అని తనలోనం దలపోయుచుం జనిచని ముందట. ౨౦

సీ. స్ఫటికరత్నగృహంబు సర్వంసహాకాంత కభిధాంతరంబు దుగ్ధాంబునిధికి
మణిదర్పణము నభోమణిమార్గలక్ష్మికిఁ జంద్రాతపమునకు జన్మభూమి
యర్ధేందుమకుటాట్టహాసంబునకు జోడు పౌలస్త్యగిరికి సబ్రహ్మచారి
ప్రతిబింబమభ్రముప్రభువారణమునకు ననుఁగుఁజుట్టము శారదాభ్రములకుఁ
గమఠతిమినక్రవిక్రమక్రమవిహార, చటులతరవీచికాఘటానమదయూథ
హంసకులసన్నినాదసంవ్యాప్తదిగ్వి, భాగ మీక్షించె నతఁడు తటాగ మెదుర ౨౧

మ. వసుధానిర్జరుఁడు స్మహాసరసిలో వార్వీచులం దేలెఁ ద్రా
వె సుధాసన్నిభ మైనవారిఁ దటపృథ్వీజావళిచ్ఛాయలో
వసియించెన్ లహరీసమీరముల నధ్వశ్రాంతి పోకారిచె
న్బిసకాండంబులు మేనఁగూర్చెఁ జలువ ల్నిర్మోకసంకాశముల్. ౨౨



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. కరశీకరార్ద్రపుష్కర, కరుఁడై యాతండు గంధకరిరాజుక్రియం
బరిషేకాంతరమునఁ దా, సరసిరుహాకరము వెడలి చాలఁగ నొప్పెన్. ౨౩

సీ. వైదూర్యమణిశిలాస్వచ్ఛోదకముగానఁ గౌతుకం బొనరించెఁ గన్నుఁగవకు
శిశిరసంస్పర్శవీచీమారుతముగాన నంగకంబులకు నిం పావహించెఁ
గమలకేసరరేణుగంధోల్బణముగాన ఘ్రాణేంద్రియమునకుఁ బ్రమద మొసఁగెఁ
గలహంసకులకలకలకులాయముగాన శ్రుతిసంపుటములకు సుఖమునిచ్చె
- - - సలిలంబుసమ్మోదమునను జేసె, నాలుకకునప్పుడవనిబృందారకునకు
సైకతాగాధజలమానుషీకదంబ, కాంక్షితార్కమయూఖంబు కమలవనము. ౨౪

క. కొలనిదరినటము నీడన్, శిలతల్పమునందుఁ గొంతసేపు శయించెం
జెలువ మగువలి పెదుప్పటి, తలగడఁగాఁ జేసి సచివతనయుం డలఁతన్. ౨౫

గీ. బహులపక్షపాకదంబములలోనఁ, బ్రభవ మొందినయంధకారంబువోని
కొలనిదరికాననంబులోఁ గొంతప్రొద్దు, నలపువాయంగ నిద్రించె యాజ్ఞసత్త్రి. ౨౬

గీ. డప్పిదీఱంగమధురకాండంబుఁ గ్రోలి, కడుపునిండంగఁ దూఁడుఁ దీఁగలు భుజించి
యెండవాలారునందాఁక నిండుకొలని, తీరమున మఱ్ఱినీడ నిద్రించె నతఁడు. ౨౭

చ. అపుడు విలంబమాన మయి యంబరకోణతటాంతరంబునం
దపనునిమండలంబు బెడిదం బగు వేఁడిమి నొయ్య వీడ్కొనెం
గపిలములై మయూఖములు కార్తికమాసకలాపిపింఛమై
త్రపుసలతాశలాటుసముదాయముచాయఁ దిరస్కరింపఁగన్. ౨౮

గీ. అంతలో నిద్ర మేల్కాంచి యవనిసురుఁడు, జిగమిషాబుద్ధి నీక్షించెఁ జిత్రభాను
నభినవోన్మేషకుటిలజిహ్మప్రకార, లోలతారక కేకరాలోకనమున. ౨౯

శా. కాంతారాంతరభూమిచెంత శబరగ్రామంబు పద్మాకర
ప్రాంతక్షోణితలంబునం గలుగ సంభావించె విప్రుం డెదన్
దంతిస్కంధకపోలకుంభపలలాదక్రూరకౌలేయకీ
సంతానస్ఫుటకంఠఘుర్ఘురతరద్రాఘిష్ఠనాదంబులన్. ౩౦

సీ. ఆదికాలమున మాయావిలాసిని యైనమురదైత్యదమనునిమూర్తివోలె
ధరణితలంబునఁ జరియింప నేర్చిన పురుహూతమణిశిలాపుత్త్రివోలెఁ
గామినీరూపంబుఁ గైకొన్నశంబరారాతికాలాయసాస్త్రంబువోలె
వేడ్కకైమానుషీవిగ్రహంబు ధరించి విహరించుతొలుకారువేళవోలె
సంధతామిస్రమునునవిద్యయునుబోలె, భువనమోహనరూపవైభవములొలయ
లీల నేతెంచె నొక్కచండాలకన్య, కొలనఁ జలుబంతిపసుపాడఁ జెలియుఁ దాను. ౩౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శా. ఆచండాలకులప్రసూత యగుకన్యం గన్యకారత్నముం
జూచె న్దవ్వుల యాజ్ఞవల్కి విపినక్షోణీవిభాగంబునన్
వాచాగోచరసౌకుమార్యనవలావణ్యాన్వితం బుష్పనా
రాచుం డిక్షుశరాసనంబు ఘనదోర్దండంబునం గూర్పఁగన్. ౩౨

ఉ. యోగసమాధితత్పరత నున్నవిధంబునఁ బాసినట్లు మూ
ర్ఛాగమమీలితాత్ముఁ డగుచాకృతినిశ్చలదేహయష్టియై
సోగకనుంగొన ల్కుదురుచొక్కుల కిక్కలుగాఁగ నత్తఱిన్
రాగరసాతిరేకమున బ్రాహ్మణుఁ డాదటఁ జూచె మాలెతన్. ౩౩

సీ. అప్సరస్త్రీవోలె నకులయై యారయ యీప్సైవలి కన్నులపండువయ్యెఁ
జారుయానస్వరూపసంపన్నయై మోకవనరేఖయునుబోలెఁ బెనఁచె వేడ్కఁ
బొలఁతి ప్రావృడ్వేళవోలె నళివినీలఘనవేణియై యిది గరము మెఱసె
నిభరాజనిభయాన యిదిశరత్తువువోలెఁ బుండరీకాక్షియై పొలుపుమిగిలె
ముట్టరానిది యైనట్టిమూర్తివోలెఁ, జిత్తరువువోలె దృష్టికచ్చెరు వొనర్చె
మెలఁత మధుమాసకుసుమసమృద్ధివోలె, జాతివిరహితయయ్యుసంప్రీతినొసఁగె. ౩౪

గీ. దీనిఁగల్పించె నజుఁ డభిధ్యానమునను, నాతి మునుముట్టరాకుండ నంత్యజాతి
ముట్టుటయ కల్గెనేని యిమ్ముదితమేను, గందకుండు నెపుష్పంబుకంటెమృదువు. ౩౫

వ. అనివిస్తృతనిమేషంబు గీలించి ముకుళితపక్ష్మాంచలంబును జిహ్మతరతరళశాతోదరం
బును నగువీక్షణంబున నవ్వెలివాడవ్రీడావతి నీక్షించుచు నవ్విప్రుండు మదనశ
రశలాకాశంకుసంకలితహృదయుండై స్తంభితునిభంగి విలిఖితునిచందంబున నుత్కీ
ర్ణునివగిది నియతునిలాగున మూర్ఛితునిప్రకారంబునం దన్నుఁదా నెఱుంగక నివ్వె
ఱపడి నిశ్చలాంగుండై యుండె నమ్మచ్చెకంటియు నలవోకవోలె నతిస్వచ్ఛసౌభా
గ్యచ్ఛాయావినిర్భర్త్సితమత్స్యకేతనుం డగునాబ్రాహ్మణుఁ గనుంగొని నిజాంత
రంగంబున. ౩౬

గీ. విప్రవేషంబుఁ దాల్చినవిష్ణుఁడొక్కొ, బ్రాహ్మణుం డైనశంబరారాతియొక్కొ
బాడబాన్వయరూపసంప్రభవుఁడైన, చందురుండొక్కొ యితఁడతిస్వచ్ఛమూర్తి. ౩౭

వ. అని యంతంతం జేరవచ్చియయ్యంత్యజాతిసీమంతిని యశేషజనపూజనీయులుబ్రా
హ్మణు లని తమకులంబుపెద్దలవలన వినుటంజేసి యుఁ దా నెం దేనొక్కపూర్వజన్మ
కృతపుణ్యసంస్కారవిశేషంబుననో బాల్యంబునాఁటనుండియు రూపంబు వినయం
బు దాక్షిణ్యంబు మధురాలాపకౌశలంబు నిస్సంగత ప్రశాంతమహానుభావంబు శు
చిత్వంబు గౌరవంబు సద్భావంబు గుణంబులు నైసర్గికంబులయియుండుటనో భర్గఘా

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

లనయనకృశానుజ్వాలాజాలహేలాచులుకితావయవుండు గానికుసుమకోదండుం డునుంబోలెఁ గన్నులపండువై తప్తకాంచనవర్ణంబును గోరోచనాగౌరంబును జాంపేయకుసుమకేసరరేణుత్రసరేణువిసరప్రసంగంబును నగుదేహప్రభాప్రవాహంబున గహనపంటం బశేషంబును వెలింగించువాని నుద్భిన్ననవశ్మశ్రు నభినవయౌవనోద్భాసితు షోడశవర్షదేశీయు నాదిగర్భేశ్వరు నమాత్యనందను సుకుమారుం గుమారసన్నిభుఁదప్పకచూచి భయసంభ్రమడోలాయమానదంతతాటంకవలయం బగునట్లుగా నిబ్బరంపుగుబ్బచన్నుల బిబ్బోకంబు బాహుమూలకూలంకషంబైయాపద్విలోకనీయంబుగఁ గేలుదోయి సేవాంజలిపుటంబు లలాటంబునఁగీలించి యయ్యగారికి నమస్కారం బని యధరకిసలయంబునకు దశనరత్నాంకురజ్యోత్స్న కుసుమస్తబకంబుగా సహకారపల్లవాస్వాదకషాయకంఠకలకంఠకామినీకోమలకుహూకారకోలాహలకరంభితపంచమరాగప్రపంచంబునకుమించుఁ జూపు కంఠస్వరంబునం బలికిన. ౩౮

గీ. వెలఁది మాలెతగాన దీవింపకయును, నొప్పెడిదిగాన నూరకయుండకయును
ధరణిదేవుండు గైకొనె దానిమ్రొక్కు, కేలుఁదామర తిర్యగాందోళనమున. ౩౯

ఉ. శంబరవైరిసన్నిభునిఁ జాగుతరోజ్జ్వలమూర్తి విప్రర
త్నంబు మహాప్రధానుప్రియనందనుని న్సుకుమారుఁ జూచి ప్రే
మంబు వహించి యుం గొమరుమాలెత గన్నుల నవ్వు దేరఁగా
సంబళి సంబళీ యళుకు సందడికిం దలమంచుఁ బల్కుచున్. ౪౦

గీ. బ్రాహ్మణుఁడుగానలజ్జింపఁ బ్రాప్తిలేక, బాలప్రౌఢయవోలెఁ దప్పకయచూచి
చాటువడియుండుమయ్య యీసరసిలోన, నుదకమాడెదఁగాక పిన్నదియు నేను ౪౧

క. అని పలుకుచుఁ గొలనికి డిగఁ, జని మాలప్రమద దాను సఖియు నొనర్చెన్
వనకేళి తరంగ లురు, స్తనభారాస్ఫాలనమున జర్జరములుగాన్. ౪౨

చ. పడఁతి పసిండిడాలుగనుపట్టు హరిద్రముఁ దీరపంకముం
దొడసి సరోవరాంబువునఁ దోఁగి పయోనిధితీరభూమికి
న్వెడలి ధరానుపర్వునకు నేత్రమహోత్సవ మయ్యె నప్పు డ
ప్పుడ కలశాబ్ధిమధ్యమునఁ బుట్టిన యాదిమలక్ష్మియో యనన్. ౪౩

ఉ. ఆకలకంఠి యొయ్యఁ దడియార్చునెడన్ జఘనాంతికంబులై
కేకికలాపలీల నణకించి మధువ్రతమాలికాకృతిం
గైకొని యింద్రనీలమణిఖండవిలాసమలిమ్లుచంబులై
చీఁకటి గొల్పె బ్రాహ్మణునిచిత్తము పెన్నెఱిసోగవెండ్రుకల్. ౪౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. చికురసంతతి నీరార్చి చెలువతుఱిమె, నేసకొప్పొక - - - -
చన్నుఁగవసొంపుకచ్ఛ దేశముల మెఱుఁగు, బ్రాహ్మణునియాత్మఁ బల్లవింపంగఁ జేయ. ౪౬
గీ. దంత తాటంకచక్రమధ్యంబునందు, బాల కీలించెఁ గం కేళిపల్లవంబు
బాడబుని నేయఁదలఁచు శంబరరిపునకు, బ్రథమమదియనమస్కారబాణమయ్యె. ౪౭
గీ. పూనెఁ గుచముల వెలివాడపువ్వుఁబోణి, విప్పగలయట్టి బండిగుర్వెందనరముఁ
బ్రథమరాగరసోదయరక్తమైన, సచివనందనుహృదయజసంగరమున. ౪౮
వ. అప్పుడు సుకుమారుండు నిజాంతర్గతంబున. ౪౯
సీ. ఏలచేయండు శేషేంద్రియంబులు నాల్గు నలినగర్భుఁడు లోచనములుగాఁగ
నెట్టుగల్గె విధాత కీరూపనిర్మాణపరిమాణములకోటిపరిమితంబు
లజుఁడు దీని సృజించి యాత్మ నువ్విళ్లూర కెట్లుండుఁ గూఁతు మోహించినాఁడు
కల్పింపఁబోలు శృంగారసర్గంబున దీని వాక్పతి యున్నది ఫలియించె
దీనినిఖిలావయవములు తీర్చి తీర్చి, చేయునపుడు ప్రయాసంబుఁ జెందుటయును
నొయ్యనొయ్యన బ్రహ్మనిట్టూర్పువుచ్చె, నదినుమీపుష్పసమయమందానిలంబు.
వ. అని విచారించుచు విప్రుండు చండాలకులకన్యకామణి దుర్లభంబగు సౌభాగ్యం
బునకు నద్భుతం బందుచు దాసితో సంభాషింపఁ గోరి చేరువ నిలిచె ననంగమక
న్యకారత్నంబును నతని కిట్లనియె. ౫౦
క. ఎందుండి యరుగుదెంచితి, రెం దరిగెద రిచటనునికి కేమికతంబో
కందర్పరూపరేఖా, సౌందర్యవిలాసవిభవసర్వస్వనిధీ. ౫౧
వ. నిన్నుంజూచి సుఖామృతంబున మునింగినచందంబున నతి - - - సముద్రంబు
నం దేలినవిధంబున సర్వానందంబుల కుపరిభాగంబున వర్తించుకరణి సకలమనోరథం
బులకు సంకేతంబైనలాగున నాహృదయంబు నిర్వృతింబొందియున్నయది. ౫౨
ఉ. క్రొన్ననవింటిజోదు నలకూబరు నైషధునిం జయంతునిం
బున్నమనాఁటిచందురునిఁ బోలినవాఁడవు రూపసంపదన్
నిన్నొకవిప్రుఁగాఁ బరిగణింపఁగవచ్చునె కల్ల గాదు మా
యన్నలయాన చూడు పులకాంకురముల్ మొలచెం గుచంబులన్. ౫౩
గీ. అవనిసుర చింతకాయల కాజ్ఞగాక, యరసిచూడంగ గ్రుక్కిళ్లకాజ్ఞగలదె
యంటరాకున్ననేమి యంతంత నిలిచి, చిత్తమలరంగ నిన్ను వీక్షింపరాదె. ౫౪
సీ. కమలినీపత్రపుటములఁ గాసారోదకముఁ దెచ్చి పాదపద్మములు గడుగఁ
జిలుకముట్టనిఫలంబులు గోసికొనివచ్చి పరికించి యారగింపంగఁ బెట్టఁ
గాంతారకర్పూరకదళీకాదళముల సరసరీతులను వీజన మొనర్ప
నధ్వఖేదముఁబోవ హస్తద్వయంబున నూరుకాండము లొత్తి యుపచరింప

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వేశ్యయయ్యెఁ ను వినయంబువిస్తరిల్ల,భక్తిగొనఁగఁ బ్రమోదంబు పారమేదు
నీకువిప్రోత్తమునకు నీనెలవులందుఁ, జెడ్డదుర్జాతి యది నన్నుఁ జెఱచెఁగాని. ౫౫
క. ఇది హూణమండలం బ, వ్వదియున్నది చెంచుపల్లె వనమధ్యమునన్
మదననిభ యీపుళిందా, స్పదంబు వెలివాడ - - - - - ౫౬
తాళవృత్తము. కనుఁగొననలయుచుదావవ్వులనెడగలుగ. నిలిచియైననుమాయిండ్లన్
వనమధ్యంబున విప్రోత్తమ వెలివాడవనితలకు నేత్రోత్సవమై
యనిభృతపరభృతనఖరేఖాకో - - - - సహకారద్రుశాఖా
ఘనఫలరసధారామృతపానోత్కంఠపిన్నృత్తాననవటుకంబున్. ౫౭
క. పాణసివారము కమ్మని, ప్రాణము నెఱజాణదేవరా వినవలదా
వీణావాద్యముఁ బాటయు, వేణుస్వానంబు వేనవేల్చందములన్. ౫౮
వ. అని చండాలకన్య పలికిన నవ్విప్రుండు భవితవ్యతాబలంబున. ౫౯
సీ. ఇది యసజ్జనగోష్ఠి యిది మోహవిలసితం బిది మహాపాతకం బిది యకీర్తి
యిదిదుర్మదాంధత్వ మిది యాగ్రహావేశ - - - - - యిది కుదృష్టి
యిది నారకద్వార మిది ప్రమాదస్థలం బిదిమౌర్ఖ్యకారణం బిది యనియతి
యిది యధర్మముత్రోవ యిది పథప్రచ్యుతి యిది యధోగతిహేతు విది యకృత్య
మని విచారింప కవనీసురాధముండు, కల్కిచండాలకన్యపైఁ గన్నువైచెఁ
దీయతీయనివింట లేఁదేఁటినారి, శంబరారాతి మోహనాస్త్రంబు దొడిఁగి. ౬౦
వ. ఏయునప్పుడు నిజాంతర్గతంబున. ౬౧
సీ. మాంసంబు భక్షింప మనసువెట్టిననాఁడ దాక్షిణ్యగుణము విధ్వంసమయ్యె
గంజాయిఁ దినఁగ నుత్కంఠఁజేసిననాఁడ లజ్జాభిమానంబు లుజ్జగిల్లె
హాలారసముగ్రోల నభిలషించిననాఁడ సూనృతోక్తులసుద్ది చూఱవోయెఁ
బరకళత్రముల వెంబడఁదలంచిననాఁడ ప్రజ్ఞావిలాసంబు పదటఁగలసె
నింక నేటికి వంచింప నిలుపునాకు, బరువె యీపాపములలోనఁ బాపమొకటి
వరుసవేయింటిమీఁద జవ్వాదికొమ్ము,తివుట జండాలకన్యకఁ గవయువాఁడ.
వ. అని పరమసాహసంబు చేసి సుకుమారుండు చండాలకన్యకం జేర వచ్చి యిట్లనియె.
కవిరా. సగసిజలోచన యొక్కమహామునిశాపవశంబునఁ బాణచివై
ధర జనియించినదానవు నీవిదితథ్యము కిన్నరభామినివో
గరుడపురంధ్రివొ యక్షవధూటివొ గాని జఘన్యవు గా విఁకనన్
ధరణిసురోత్తముని న్వరియింపు సుధాకరసూర్యులు సాక్షులుగాన్. ౬౨
వ. సామాన్యస్త్రీజనంబుల కిట్టియమానుషలోకోచితంబు లైనసౌభాగ్యంబులుం గల్గు
నె మునికోపవశంబున సముజ్ఝితదివ్యశరీర లగుదేవకాంతలు శాపవశోపనీతం

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మైన శరీరంబు నధిష్ఠింతురు తొల్లి స్థూలశిరుండనుమహాముని త్రిభువనలలామభూతయగురంభ నేదేనియొక్కనిమిత్తంబున శపించె ననియును దచ్ఛాపంబున నయ్యప్సరస బాడబరూపంబు ధరియించి మృత్తికావతియందు శతధన్వుండను రాజును సేవించుచుఁ బెద్దకాలంబు మర్త్యలోకంబున నుండె ననియును విందుము. ౬౭

సీ. జలజగర్భునిమానసంబు వేదంబులు దక్షప్రజాపతి దర్పకుండు
సౌదామనీవల్లి చంద్రికాలోకంబు సప్తజిహ్వాజ్వాలసప్తకంబు
రవిమయూఖములు నీ రవని దుగ్ధాంభోధి మృత్యుదేవతనోరిమెఱుఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించినదివ్యగంధర్వజాతిద్వయంబుఁ
గారణంబులుగాఁ బుట్టినారు పదియు, నాల్గుకోట్లప్సరసలునా నాకసతులు
వారిలో నొక్కతెవు నీవు వారిజాక్షి, యేమిదుష్కృతిఁ బుట్టితో హీనజాతి.

గీ. తివుచుచున్నది భవదీయదృగ్విలాస, మెత్తుకొనిపోవుచున్నవి యింద్రియములు
వెనుక ద్రొబ్బుచునున్నాఁడు మనసిజాతుఁ, డేమిసేయుదుఁ జెప్పవే యిందువదన.

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని, కామతంత్రంబునకు సంచకరువ్వ గాఁగఁ
జుంబనము సేయని మ్మోష్ఠబింబమిపుడు, గండుఁగోయిలచిగురాకుఁ గమిచినట్లు

గీ. అనుచువిప్రుండుతమకించియంటుకొనియె, సమ్మతించియయుండెనాచంద్రవదన
శూకలాశ్వంబు నన రేఁపఁజొచ్చినప్పు, డనుమతింపదె యత్తళు వైనబడబ. ౬౯

వ. ధీరోదాత్తయగుట నమ్మత్తకాశిని చిత్తజాయత్తయయ్యును దత్తఱపాటు లేక యతని ౭౦
తో ని ట్లనియె.

సీ. కలుగుచున్నవి యనేకములు వికల్పము లాడుచున్నవి యపాయంబు లెదుర
నంతరాయము లసంఖ్యములు గన్పట్టెడు సందేహములు పెక్కు చాయవాటె
యంకురితములయ్యె శంక లేరాళంబు వికృతు లెన్నేని యావిష్కరించె
శాఖోపశాఖలఁ జాఁగుచున్నది రట్టు గుఱి లేక యుదయించె గోసనాస
యిన్నిటికి నోర్చి నీకోర్కి యేను దీర్తు, నింతవానికి నన్నీగు లెరవె - - -
యెప్పటికి నిత్తునో లేక యీశరీర, మిప్పటికిఁ జాలునో నిక్క మెఱుఁగఁ జెపుమ.

గీ. మొదలఁగక్కుర్తిపడికూడిపిదపవాయు, నొక్కకమలాననకుడక్కియుండఁజాలఁ
డడవిఁ బెక్కుపుష్పంబులయందువ్రాలు, చంచరీకంబుమగవాఁడునరియును వ్వే.

ఉ. చందురుఁ డంతఁజూడఁడు నిశానటిఁ బున్నమనాఁడుగూడుచోఁ
గందళితానురాగుఁడయి కానఁగవచ్చు నహోదయంబులం
జందముదప్పి మీఁదనొకచాయకువచ్చుఁ గ్రమక్రమంబునన్
సుందరిపట్టునందుఁ బురుషుండును నట్లయకాఁ దలంపుమీ. ౭౩

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అనిన విని సుకుమారుండు. ౬౪

క. మగవారల నిందింపకు, తగవును బంతంబు నిజము ధర్మముఁ గృపయుఁగా
మగవారికెగా కెందును, నుగువలకుం గలదె చంద్రమండలవదనా. ౬౫

సీ. హరునిచిచ్చుఱకంట నసమాస్త్రుఁ డీల్గిన రతిదేవి యెట్లు జీవితముఁ జెందెఁ
బాండుభూపాలుండు పరలోకగతుఁడైనఁ గుంతి చావక యేమికుడువనుండెఁ
బ్రథనాంగణమున సౌభద్రుండు చచ్చిన బ్రతికె నెట్లు విరాటరాజతనయ
సింధురా జస్తమించిన నేల దుస్సల కాషాయవస్త్రంబు గట్టుకొనియెఁ
బంక్తిరథుఁ డన్యలోకసంప్రాప్తుఁడైన, నేల కౌసల్య ప్రాణమీనెఱుఁగదయ్యెఁ
దగవు ధర్మంబు పాడి పంతంబు లెట్లు,భామలెట్లు వృథానులాపంబు లేల?

గీ. అనినఁ జండాలకన్యక యాఁడువారి, మంచితనమును మగవారి మంచితనము
సరియ కీడని మేలని చర్చ లేల, మనకు మనయాడికలు తప్పకునికి చాలు. ౬౬

వ. విశ్వావసుం డనుగంధర్వరాజునకు మేనక యనునప్సరసకుం బ్రభవించినప్రమద్వర యనుకన్యక స్థూలకేశాశ్రమవనంబునఁ బాదమర్దితం బగుపన్నగంబు గఱచినఁ బ్రవిలుప్తజీవితయగుటయు భార్గవుం డగుచ్యవనునకుఁ బౌత్రుండు ప్రమతికొడుకు రురుం డాయురర్ధంబొసంగి యయ్యంగన బ్రతికించె ననియును, నర్జునుం డశ్వమేధాశ్వానుసారియై యాత్మజుం డగుబభ్రువాహనునిచేత నాహవాంగణంబున శరాహృతప్రాణుండైన నులూచి యనునాగకన్యక రసాతలంబుననుండియే తెంచి యుద్గతప్రాణునిం జేసె ననియు విందుము. మంచితనంబు లాఁడువారికి మగవారికి సరియ యద్ది యటులుండె నాపంతంబు వినుము. ౬౭

ఉ. నాకు మనంబునిండ నొకనమ్మిక సేయుము - - - -
గైకొనువాఁడ నిన్ననుము కాదన కెక్కడకైన వచ్చెద
న్నీకొక టయ్యెనేని యవనీసురమన్మథ నిర్విశంకత
న్నాకముఁ జూఱవెట్టెద ధనంజయతీవ్రశిఖాముఖంబునన్. ౬౯

వ. అనిన విని సంతోషించి సుకుమారుండు. ౭౦

సీ. కలహంసనంపద గలకలక్రేంకారకలకలం బైనయీకొలను సాక్షి
ప్రసవసౌరభనటద్బంభరం బైనయీవలనిలతామండపంబు సాక్షి
ప్రచ్ఛాయశీతలోపరిభాగ మై (నయీ) శశికాంతమణిశిలాస్థలము సాక్షి
తరులతాగుల్మసంతతపిధానాతపవ్యాపారమైనయీవనము సాక్షి
మకరకేతనుపాదపద్మములు సాక్షి, రతిమహాదేవిజఘనభారంబు సాక్షి
సత్య మెన్నఁడు నినుఁ బాయ సమ్మతించి, కౌఁగిలింపఁగనీఁగదే కమలవదన, ౭౧

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. అనినఁ జండాలి కరారవిందంబులు మొగిడిచి సవినయంబును సగౌరవంబును సాను
రాగంబును గా నతని కిట్లనియె. ౮౨

ఉ. నేఁడు కృతార్థు లైరి జననీజనకు ల్ఫలియించెఁ బుణ్యముల్
నేఁడు పురాకృతంబు లవనీరుహమూలనివాసి యైనకా
[1]క్రేఁడిలువేలు పౌచునొనరించె మనోరథసిద్ధిసంపదల్
నేఁడుగదా సుధారసము - - - - గంటి ధరాసురోత్తమా. ౮౩

ఉత్సాహ. మలుసమర్త నంటకుండి మాలదాన నగుట నేఁ
గలయ నీళ్లనాడి కడవఁ గ్రంత యంటుకొనుటకై
కొలనఁ గ్రుంకి పోవుచుండి కుసుమబాణనిభుని ని
న్నలఘు - - - - లోచనంబు లలరఁ జూచి వలచితిన్. ౮౪

గీ. ఏమిసేయుదు నీకు నెట్టిత్తు నన్నుఁ, బంచముని యింటఁగలుగు బీభత్సు నెఱిఁగి
యిచ్చగింపకయుండ నేనెట్లు నేర్తు, నధికతర మైనమన్మథాయత్తు నిన్ను. ౮౫

వ. అనిన సుకుమారుండు చండాలకన్య కిట్లనియె. ౮౬

శా. ఏమాసించినఁ బ్రాణరక్షకయి యేమేఁ బావము లేసినన్
భామా చెల్లుఁ బురాణసంహితలఁ జెప్పన్వింద మే కాదె వి
శ్వామిత్రుం డెడరైనచో శునకమాంసంబున్ భుజింపండె నీ
వ్యామగ్రాహ్యకుచంబులంటి యిదె నాప్రాణంబు రక్షించెదన్. ౮౭

వ. ఇదె యెదుర సంభ్రమరకులచరణ నఖశిఖాశిఖరవిశీర్యమాణ కుసుమకేసరరేణుత్రస రేణువిసరవిసం - - - - రంబు లతామండపం బిదె వెనుకఁ గుటిలశుకత్రోటికోటీ విపాటితమధురఫలరసధారాసారదుర్దినాయమానాభ్యంతర ప్రదేశంబు చూతతరు వాటికాభ్యాశం బిదె కెలన మదకలమల్లికాక్షపక్షపాళీనవపవనసంపాతకంపమానక మలకేసరపరాగధూళీ విరచితాళీకసంధ్యానుబంధచకితచక్రవాకనీడోద్భవక్రీడానీ డంబులు, సరససైకతవేతసీనికుంజక్రోడంబు లిందు నీకునింపుపుట్టినట్టియెడ నన్ను మన్నింపు మంటకున్నదాన నని భయం బందకు కుసుమసమయంబు గదా ఫలావాప్తి కి మూలం బింకఁ గాలక్షేపంబు చేసితేని కందర్పుండు దర్పాతిరేకంబున భవద్భ్రా వల్లీమతల్లికిం దల్లియగునించువింటిబద్ద దిగిచి కొదమతుమ్మెదఱెక్కఁగఱిగట్టిన పూమి ట్టకోలల హృదయంబుద్ఘాటించి చంపుఁ జంపకకుసుమగంధీ ప్రాణంబు రక్షింపుమిదె నీకుసేవాంజలి యని కంకణఝుణఝుణత్కారంబు తోరంబుగా సుకుమారుండు నఖకిరణపరంపరాకుసుమకుట్మలాభిరామంబు లగుకరకిసలయంబులు మోడ్చిఫాల భాగంబునం గీలించిన. ౮౮

[1] క్రేండిలువేల్పుచ్చై యొనరించె - మూ.



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గా. వాలాయంబుగ నద్ధరానురుఁడు ద న్వాంఛించిన స్కందహా
సాలం (కారమ) నోజ్జ్వలమైనముఖ మొయ్యన్వాంచి చండాలి యా
లీలాభావ మెఱింగి (యేగి) నతవల్లీకుంజమధ్యంబునం
గేలీతల్పము దీర్చెఁబో మృదులకంకేలీప్రవాలంబులన్. ౮౯

వ. అనంతరం బధరీకృతకుసుమా (యు) ధధరరూపసంపన్నుఁ డగునవ్వసుధానిలింపుం డపహసితసురసిద్ధగంధర్వవిద్యాధరలీలావిలాసినీవిలాసవతి యగున వ్వెలినాడచేడి యం గూడి సురతసౌఖ్యం బనుభవించె నంత ౯౦

ఉ. కాయజవిక్రియం బడయఁగానికులంబున సంభవించి య
న్యాయముసేయునే యిటు దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్
మాయఁగఁదట్టె యంచు సతిమాత్రము లజ్జితుఁ డైనకైవడిం
దోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోఽంగణమ్మునన్. ౯౧

గీ. గగనయానవేగంబునఁ గలమరించి, కడుపునిండంగఁ గ్రోలిన కమలమధువుఁ
గ్రక్కెనో నాఁగ గగనమార్గంబునందు, భానుబింబంబు రక్తాతపంబుఁగాసె. ౯౨

శా. ప్రాలెం బశ్చిమశైలశృంగముపయిం బ్రత్యగ్రమధ్యాగమో
న్మీలత్కింశుకకోరకస్తబకకాంతిన్ భానుమన్మండలం
బాలంబించె మరుండు హస్తమున దాఁపారామలీలావతీ
భ్రూలేఖానిభవిభ్రమాభ్యుదయముం బుండ్రేక్షుకోదండమున్. ౯౩

క. క్రుంకె విభాకరబింబము, పంకజషండములు మొగిడెఁ బ్రత్యగ్దిశ రం
గం కేలీతరుపల్లవ, సంకాశచ్ఛాయఁ గొమరుసంజ జనించెన్. ౯౪

గీ. పద్మినీషండములనుండి పాసి చనియెఁ, గోకమిథునంబు లత్యంతశోకపరతఁ
దోన యేతెంచె భ్రమరసందోహ మపుడు, కంఠలోహార్గళంబులకరణిమెఱయ. ౯౫

వ. ఇవ్విధంబునం బ్రతీచీకర్ణపూరరక్తోత్పలంబును జక్రవాకచక్రవాళకులచక్రవర్తియు నగుమార్తాండుం డు లోకాంతరంబున కవతరించినఁ గ్రమంబున నంబరతటాకవికచకమలిని సంజ మంజుమంజిష్ఠాపరాగసౌష్ఠవంబు సంధించెఁ గృష్ణాగురుపంకవల్లికల యుల్లాసంబు నుల్లసంబాడుచుఁ జిలుపచిలుపచీఁకటి సిద్ధవిద్యాధరనితంబినీజనంబుల చెక్కుటద్దంబులతోడం జరలాడె సాంధ్యదేవార్చనాబలిపిండంబులుంబోలె గగనమండలంబున వెండితగటుఁ దెగడి క్రిక్కిఱిసి చుక్కలు వొడిచెఁ బురుహూతాంతఃపురపురంధ్రీవిలాసదర్పణంబు దర్పకునిమాటుఁబొంది చందురుం డుదయగిరిశృంగశృంగాటకంబునఁ బటికంబుగుండుచందం బొందె నప్పుడు చండాలకులవరారోహ వాహకుం డెక్కి విడిచినవారువంబుఁగొదమయుంబోలె సంభోగంబునం దృప్తిచని తనివోవనికౌతుకంబున సుకుమారుఁ గౌఁగిటం జేర్చి యి ట్లనియె. ౯౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. అల్లదె వేటపల్లె యటనావల మావెలివాడ యావలన్
భల్లనిపాతమాత్రమునఁ బర్వతనిర్ఝరసింధు వావలం
దెల్లనిగోపురంబుల నతిప్రమదావహ మైనరోహిణీ
వల్లభమౌళిభామిని నివాసము - - - - లాప్ర.దేశముల్. ౯౭

గీ. ప్రతిభ సతతంబుఁ గొల్తు రాభద్రకాళి, జగతి నేఁబదియాఱు దేశములవారు
దశదినంబులు సింహకేతనము నిలిపి, హూణభూమికి దైవ మీయుత్పలాక్షి. ౯౮

వ. నీవమ్మహాస్థానంబున వసియింపు మేను నీకు నాయావేళలఁ బరిచర్య సేయుచు వంచన బయల్పడకుండ మెలంగెద సర్వకలావిశారదుండవైననీకుం బ్రాకారగోపురద్వారవేదికాప్రాకారప్రఘాణకుట్టిమహట్టసౌధవీథీవిటంకంబులం గావ్యగోష్ఠీపరిహాసకథాబిందుమతీభిత్తికా ప్రహేళికాభావన సుభాషితశ్రవణంబు, వారవిలాసినీదర్శనంబు, వైతాళికస్తుతిపాఠకంబు, దురోదరక్రీడ, చిత్రకర్మంబు, వీణాస్ఫాలనంబు మొదలయినవినోదంబులం బ్రొద్దుపుచ్చంగలిగెడి వెండియు. ౯౯

క. వెలివాడకుఁ గడుఁ జేరువ, సెలయేటికిఁబొరువు త్రాళ్లఁ జిట్టేఁదులు నా
వలఁ దఱచు భద్రకాళీ, నిలయం బదిలెస్స నీకు నెలవు వసింపన్. ౧౦౦

గీ. ప్రొద్దు వోకుండ ముండటఁ బొదమ నీవు, కాళికాస్థానమునకు నీకాలిత్రోవ
విప్రగృహమున నీకు నే విందొనర్తు, ధర్మమిషమున నింటిపెద్దలకుఁ జెప్పి. ౧౦౧

వ. - - - - చెలికత్తెయుఁ దానును వేఱొక్క తెరువున నిజనివాసంబునకుం జనియె నుకుమారుండు చెఱువుకొమ్ముదాపలం బట్టుకొని విపినషండంబు నడుముగాఁ బక్కణంబునకు దక్షిణంబుగా నొరసికొని పోయి కాలిత్రోవం జని సెలయేఱు గడచి ముండట. ౧౦౨

సీ. బ్రహ్మ యెక్కెడిజాలపాదంబునకుఁ గేలివసతి యైనసరోజవాటితోడ
నైంద్రవాహన మైనయైరావణగ - - - - (?)చే మొక్కయీఁడుపులతోడ
వైష్ణవరథమైనవైన తేయునకాఁగ నిరవైనప్రాకారపరిధితోడఁ
గౌమారయానశిఖావళంబునకుఁ దాండవమాడ సొబ గైనగవనితోడ
వేడ్క మాహేశ్వరం బైనవృషభరాజు, దాఁక నిల్చిన కేలిభూధరముతోడ
సకలభక్తనివాసమై చాలనొప్పు, చండిభవనంబు సొత్తెంచె సచివసుతుఁడు. ౧౦౩

మ. తనదా శీలము తా నెఱుంగుట వెలిన్ దాదవ్వుల న్ని (ల్చి దు)
గ్గనుఁ డాతండు లలాటభాగమున హస్తద్వంద్వము న్మోపి యొ
య్యన లోలోన నమస్కరించెఁ బటుగర్వారంభసంరంభశుం
భనిశుంభప్రథనక్రమప్రకటబాహాకేళికిం గాళికిన్. ౧౦౪

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఉ. మాలెతవిందు బ్రాహ్మణకుమారుఁడు పక్కణవాసి వేఁటకం
డోలమునందుఁ దెచ్చినఁ గళోరితచంద్రిక నిర్ఝరాపగా
కూలమున న్భుజించి ఘనగోపురవేదిక నిద్రవోయె న
య్యాలరిబ్రాహ్మణుండు తుహినాచలకన్యకయాత్రమంబునన్. ౧౦౫

వ. మఱునాఁడు ప్రాతఃకాలంబున నిర్ఝరాంభఃప్రవాహంబున నవగాహనంబు చేసి కపటసంధ్యావందనంబును గృతకజపంబును సూర్యోపాస్తియు నడపి బ్రాహ్మణబ్రువుండు. ౧౦౬

సీ. దంతిదంతార్గళస్తంభభారముతోడ రాజిల్లుఘనగోపురములు చూచి
గండశైలచ్ఛేదఘటితమై యొరపైనమేటికొమ్మలతోడికోట నూచి
యమృతదీధితిలోనిహరిణంబు వెఱపించు సౌధాగ్రసింహధ్వజములు చూచి
యాటమండపముపై నభ్ర ముల్లేఖించు జాంబూనదత్రిశూలంబు చూచి
చమురుగా - - - మగుచ్ఛములువోలె, సకలశాఖోపశాఖలసంశ్రయింపఁ
బుష్పితాశోకపాదపంబులనుజూచి, నింబములుసూచి యతఁడద్భుతంబు నెందె.

ఉ. కాళికదివ్యమందిరము - - - - - - దనాళికీ
లాలరసంబు గ్రోలునభిలాషమునం జనుదెంచి యున్నవే
తాళగణంబువోలె నతిదైర్ఘ్యమునన్ దివి దాఁకియున్నహిం
తాళవనంబు గన్గొని (యతండుఁమహాద్భు) త మందె నాత్మలోన్. ౧౦౭

ఉ. పైపయి గర్భగేహమునఁ బన్నికమీఁతి వెలుంగుమాలికా
దీపశిఖాప్రరోహములు దేఱఁగఁజూచి యనుస్మరించె లో
నాపృథివీసురుండు మహిషాసురమస్త - - - - దు
గ్గాపరమేశ్వరీపదనఖంబులడంబుల సంచరించినన్ ౧౦౮

గీ. సరసవనవాటికానికుంజములయందు, నెలుకలధరోష్ఠసంపుటంబులు గదల్ప
శక్తిమంత్రాక్షరంబుల (జపముసేయు), నవియవలె నున్న నద్భుతంబందె నతఁడు.

సీ. మంత్రవాదులతోడిమైత్రి సంపాదించు యంత్రవాదులఁ గనియాదరించు
సిద్ధయోగీశ్వరశ్రేణి సంసేవించు ధాత - - - - ందనముసేయు
కదలి వశ్యాశ్చర్యకథ లెఱుంగఁగఁగోరు బిలముసాధింప నపేక్షసేయు
బహుదేశభాష లభ్యాసింప వాంఛించుశల్యతంత్రముమీఁదఁ జాఁపుమనసు
- - - - గఁ బెన్నిధిగుద్దలించు, నింద్రజాలంబువన్నంగనిచ్చగించుఁ
గట్టుభవనములకుసురంగములుద్రవ్వ, నేర్చికొనుఁబ్రత్యహంబునునీచబుద్ధి. ౧౧౧

చ. స్థితిచెడి మాంసభో (జనముసేసి) యసంగమవంశభామినీ
రతిఁ బరతంత్రుఁడై నడుపుఁ బ్రత్యహముం ధరియించుచుండు న

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ష్పతితుఁడు గంగమట్టియయుఁ బ్రన్ననినున్నని నీరు కావిదో
వతులును - - - ములువంశ్యులయిండ్ల భుజించుకోరికన్. ౧౧౨
గీ. మాధుకరభిక్షలనుస్వయంపాకములను, సత్రభోజనములఁ బితృశ్రాద్ధములను
విందులను దేహయాత్ర గావించు నతఁడు, వేదశాస్త్రపురాణప్రవీణుఁ డగుట.
సీ. నీరాట నెపముగా నిర్ఝరంబుల కేగి సవిధవానీరకుంజముల నొందు
భూధరంబుల కిప్పుపువ్వ దే నని పోయి కందరామధ్యభాగముల నొందు
(శిఖరీంద్రవర) కన్య సేవింప నని పోయి సక్తమాలముల నెన్నడుమ నొందుఁ
గలమసస్యక్షేత్రములకుఁ గూల్లోగి మోసి శణవాటికాప్రదేశముల నొందు
నెట్లు కనుఁబ్రామివచ్చునోయింటివారి, నెట్లు (చీఁకటినొం) టిమై నిక్క కరుగు
నతిన పగలైన మాపైన నతనితోడ, నిచ్చ నొకపారి సాగించు నిధువనంబు. ౧౧౪
వ. ఒక్కనాఁ డక్కనిష్ఠవర్తనుండు పక్కణశబరులం గూడి కరిక్రవ్యాదంబు గుకు - - -
కొని ప్రత్యూషకాలంబున విపినవీథుల నీవారభసలవిఘటితసరఃకమలషండసౌర
భోద్గారభరితదిక్కటాహంబు కరటిమార్గం బిది, విదళితసమస్తముస్తాశకలసారంబు
వరాహయూథపథం బిది, కఠినపాషాణకోటివిభిద్యమానవల్మీక ధూళిపాళికానిచుళి
తతరుపలాశంబు మహిషవర్త్మం బిది, దూర్వాప్రవాళచర్వణహరిచందనపరిపాండు
రంబు హరిణమార్గం బిది, కటుదీర్ఘఘుర్ఘరవ్యాక్రోశంబు కర్కశేటుకులకులాయ
స్థానం బిది - - - కహరవంబు, దాత్యూహవ్యూహ ప్రదేశంబు ననుచు నాఖేట
కౌతుకంబున నాఖే లనక్రీడావిహారంబులఁ గృశుండై, ప్రాణిహింస యొనర్చుచు
౧౧౫
వెండియు.
గీ. పాపకర్ముండు కాంతారపథమునందు, నదరిపాటున నొంటిబ్రాహ్మణుల మొత్తి
యపహరించినవిత్త మన్యాయపరత, నంత్యజస్త్రీయుఁ దానును ననుభవించు.
గీ. ఇవ్విధంబున నుకుమారుఁ డీలు వుడిగి, మాలచిగురాకుఁబోఁడితో మనువుమనఁగ
వచ్చె నొయ్యన మధుమాసవాసరములు, వాసితాశోకసంఫుల్ల కేసరములు. ౧౧౬
సీ. కామినీగండూష కాదంబరీధారఁ బులకించె నారామభూమిఁ బొగడ
చివురాకుఁ జవిచూచి చవిచూచి యెలుఁగించెఁ బంచమస్వరమునఁ బరభృతంబు
సంఫుల్లకోరకస్తబకోచితం బైన కొరవిపై బ్రమయించెఁ గొదమతేఁటి
పరిపక్వసహకారఫలరసాస్వాదన ముదమునం గీరంబు చదువఁదొణఁగె
విటవిటీసముదయములు వివిధవిధుల, నుపవనక్రీడ సల్పిరి యుబ్బుమిగిలి
యఖిలజనులకుసంతోషమావహించె, మాసరములైన మధుమాసవాసరములు.
వ. ఇట్లు సకలజనమనోహరంబు లగుమధుమాసవాసరంబుల నప్పాపిష్ఠుఁడు చండాల
కన్యకం దగిలి యొం డెఱుంగక లజ్జ యుజ్జగించి మాసం బూనంబు చేసి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కులంబు పదటం గలిపి శీలంబు పరిత్యజించి దిట్టకూళయై కన్నుఁగానక కావరంబె
త్తి తిరుగుచుండఁ గర్ణాకర్ణి నతనిదుశ్చారిత్రంబు లెల్ల విని యక్కడక్కడ నాడికొ
నం దొణంగి రంత నెం తేనియుఁ దేటతెల్లం బైన యతనిదుర్వర్తనంబు ప్రసంగించి
ప్రకాశంబుగా నాడుచుండి రంత. ౧౧౯

క. క్రూరాత్ముఁ డీతఁ డనఁగాఁ, జోరుం డితఁ డనఁగ నితఁ డశుద్ధుం డన దు
శ్చారుఁ డితం డనఁగా సుకు, మారున కపకీర్తి హూణమండలిఁ బ్రబలెన్. ౧౨౦

వ. అంత నొక్కనాఁ డతండును నదియును బాతాళపంకకలుషం బగుమహాజలధిపూ
రంబునుంబోలె నంధకారంబు తోరంబై దిక్కులఁ బిక్కటిల్ల బహుళపక్షంబునాఁటి
రాత్రి కాళికాగోష్ఠంబుకెలన జీర్ణోద్యానంబునడుమ నక్తమాలతరుమండంబులోఁ
దార కల్పించిన సంకేతస్థలంబునఁ దృణకుటీరంబునఁ గోద్రవపలాశపర్యంకంబున
మదిరామదోద్రేకసంభవం బైనమదనావేశంబున మనోభవశరసీత్కారంబులనుం
బోలె సీత్కారంబులవలనను బంచబాణమాణిక్యకంకణక్వణితం బగు నప్పుడు - - -

చ. కువలయపత్రనేత్రకనుఁగొల్కులయం దుదయించె బాష్పబిం
దువులు ధరాసురుండు తనుఁ దోడ్కొనిపోక యుపేక్షసేయ న
న్నవదరవిందచక్రమిథునంబు లసహ్యవశాంగజాగ్ని చే
రవులుకొనంగఁ బుట్టిన నిరంతరధూమము పోకియో యనన్. ౧౨౧

గీ. చామ హృదయంబుమీఁదహస్తంబువైచె, నతఁడు తనుఁబాసి యేగునో యనెడుభీతి
నుల్లమునయందు వసియించియున్న తన్ను, వెడలిపోకుండ నడ్డుపెట్టెడివిధమున.

వ. అనంతరంబ యాచాండాలి యతని కి ట్లనియె. ౧౨౪

గీ. ఎట్టు వేగింతు సంసార మిచటనుండి, యేల నినుఁబాసియొంటినా కిచటనుండఁ
గలుగనిమ్ము పెక్కండ్రుబంధులునునాకు, బంధువుగలండె నాకు నీపాటివాఁడు.

శా. ఇచ్చోట న్మధుపానగోష్ఠి సురతం బిచ్చోట సంగీతకం
బిచ్చోటం బరిపాటి నీకలకలం బిచ్చో మనోజోదయం ?
బిచ్చోనంచు భవద్వియోగమునఁ దా నెవ్వారికిం, బ్రీతిగాఁ
జచ్చుక్ మన్మథవేదనానలమునం జండాలి విప్రోత్తమా. ౧౨౬

మ. కంవీరప్రసవచ్ఛదారుణరజఃకాషాయవస్త్రంబుతో
శరతూలచ్ఛవియజ్ఞసూత్రములతో జాంబూనదస్ఫూర్తిత
స్కరమృత్స్నానిటలోర్ధ్వపుండ్రకముతో సాతొచ్ఛుకబ్రహ్మతోఁ
దరమా నిన్ను మహాత్మ రేవకడ సందర్శించినం జాలదే! ౧౨౭

ఉ. ధీరత పూని నీవు పరదేశము వోవఁగ నేను రాక యా
యూరనె యుంటినే ద్విజకులోత్తమ నిత్యముఁ గాళికాగృహ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ద్వారవితర్ది కాస్థలము దవ్వులఁ జూచినయప్పు డెట్లొకో
కూరిమి పేర్మి గుండియ దిగుల్లని తల్లడ మందునోసుమీ. ౧౨౮

సీ. తను నిద్ర మేల్కొలిపినమాత్రమున జరత్కారుండు విడువఁడే ధర్మపత్ని
జమదగ్ని కొడుకుచేఁ జంపింపఁడే భార్య లవమంత దోష మల్లమున నిల్పి
యొకమాటు తప్పుగావక యహల్యాదేవి నక్షపాదుఁడు ఱాయి యగుమనండె
స్రుక్కి సన్నంబుగాఁ జూడఁడే కోపించి సతినరుంధతి వసిష్ఠర్షివరుఁడు
తగవు ధర్మంబు పాడిపంతంబునిజము, పువ్వుఁబోఁడులయెడ లేదు భూసురులకుఁ
బ్రథమమున నీవు సేసినబాస నమ్మి, మోసపోయితిఁ గులమునం దీసువడితి. ౧౨౯

సీ. పద్మాకరమునకుఁ బనుపాడఁదెచ్చిన దైవంబుచలము సాధ్యంబుగాఁగ
ననురాగరసము నామనములోనూన్చిన నయనేంద్రియములకుఁ బ్రియముగాఁగ
విడువనిన్నెన్నఁడు విశ్వసింపవె యన్న నీసత్యమునకుఁ బున్నియముగాఁగ
నిక్షుకోదండ మెక్కిడి బాణమరిపోయు కందర్పునకు మహాఖ్యాతిగాఁగ
నెపుడు నీవు ననుంబాసి యేగి తపుడె, నీర నైనను నురినైన నెగడినైన
విడుతుఁబ్రాణంబు లపుడునీయడుగులాన, పలుమఱునుఁ బెక్కుమాటలువలుకనేల

గీ. అనినఁ జెలునవ్వునవ్వి నీమనను చూడ, నంటిఁగా కేను నినుఁబాసి యరుగఁగలనె
యిట్టిపట్టున నెవ్వరు నెఱుఁగకుండఁ, బోవుటయు లెస్స యీహణభూమివిడిచి.

గీ. ఎల్లి శ్రీభద్రకాళికి నిద్ధభక్తి, యాత్రయొనరించి వెల్లుద మర్ధరాత్ర
మీవిచారంబు చెప్పకు మెవ్వరికిని, వారిజానన రట్టు నోడ్డార మిచట. ౧౩౨

ఉ. సంగరసవ్యసాచి (నయశాస్త్రవిశారద) దేశికేశ్వరా
మంగళగీతవాద్యపరిమండిత మంద్రకరుండలీకళా
భంగురనృత్త భావ్యపరిభాసితసంతతనిర్మలాత్మకా
యంగజసన్నిభ ప్రథితహాట్టవిశేషమనోజ్ఞవర్తనా! ౧౩౩

క. గౌరీవల్లభ సేవా, పారీణవిరాజివిభవభక్తి ప్రతిభా
భారోన్నతదివ్యాంగా, సారసగర్భప్రభావ సర్వజ్ఞనిధీ. ౧౩౪

మాలిని. సరససుఖవినోదా సారశైవార్థమోదా
పరమపదవివేకా భానుతుల్యప్రభాకా
ధరణిధరసుధైర్యా దండసంగ్రామశౌర్యా
నిరుపమగుణధామా నిత్యకల్యాణసీమా. ౧౩౫

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయప్రణీతం బైన శివరాత్రిమాహాత్మ్యంబునందుఁ దృతీయాశ్వాసము.

---

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

శ్రీరస్తు.

# శివరాత్రిమాహాత్మ్యము.

## (సుకుమారచరిత్రము)

చతుర్థాశ్వాసము.

క. శ్రీతరుణీసితవిలసన, జాతశివానూనభక్తిసంపద్గురువి
ఖ్యాతనుతకీర్తిసితజీ, మూతసితాఖిలదిగంత ముష్మయశాంతా. ౧

గీ. అక్కథకుఁడు శౌనకాదు లైనమహాము, నీంద్రులకుఁ బ్రియమున నిట్టులనియె
నట్లు భూమి విడిచి యరుగవలయు నింక,ననుచు మాటలాడుననసరమున. ౨

క. తెలతెలవాఱుచువచ్చెం, బలపలనయ్యెం బయోదపథమునఁ దారల్
కలకలవింకలకోఁ్షుల, కలకలములు చెలఁగెఁ గాళికావిపినమునన్. 3

సీ. సంభోగవరిభిన్నశబరసీమంతినీస్వేదవార్బిందువిచ్ఛేదకారి
విఘటమానాంభోజవిపినషండమధూళిపరిమళాసారసంపర్కసురభి
నమదకాంతారకాసరయూథసమ్మర్దసంభూతడిండీరశకలవాహి
లలితలుంగలవంగలవలీమతల్లికాలాస్యోపదేశలీలాగురుండు
యామినీశేషతుహినధారానుషంగ, జడిమభరమందచతురసంచారకారి
యల్లనల్లనఁబొలుపారునడవినడుమఁ,గాల్యసంధ్యానుగంధుండుగంధవహుఁడు. ౪

ఉ. క్షోణిరుహాగ్రభాగముల జోకలుగట్టి వనీశిఖావళ
శ్రేణులు తాండవంబు లొనరింపఁగ మంద్రగభీరభంగి శ
ర్వాణిగృహంబులోని బలివైభవలీలకు మ్రోసెఁ గంచుని
స్సాణము మాటిమాటి కనుశబ్దములీనఁగ గోపురంబునన్. ౫

శా. నిష్ఠాసంపద నర్ఘ్యపాణు లగుచు న్విప్రు ల్ప్రశంసింప మం
జిష్ఠారాగము మండలంబున నధిష్ఠింప న్నిలింపాధిభూ
కాష్ఠామధ్యమునందుఁ దోఁచెను శతాంగప్రష్ఠ సర్వద్విష
జ్జ్యేష్ఠుం డప్పుడు నిష్ఠురప్రసరబంహిష్ఠద్యుతిశ్రేష్ఠతన్. ౬

వ. ఆదివసంబున. ౭

ఉ. జాతరచేసె బ్రాహ్మణుఁడు చండికికిఁ గమ్మనిపిండివంటతో
నేతులతోడ మద్దికడ నిర్మలినాన్నముతోఁ రసావళీ
చూతఫలాళితోడ వరసూపముతోఁ జిఱువాలతోడుత్తఁ
నీతులతోడ నప్పు డకనిష్ఠతరం బగునిష్ఠ పెంపునన్. ౮

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. నాఁటిరాత్రి నిశాసమయంబునఁ గాలకంఠకంఠమూలకాకోలవిషమషీకళంక
చ్ఛాయాసముల్లాసంబు నుల్లసనంబు నుల్లసంబాడునిబిడాంధకారంబున నన్నెలవు
గదలి చండాలియుం దానును సుకుమారుండు దుర్గమాటవీవిషయంబు హూణ
దేశంబు గడచి ప్రతిదినప్రయాణంబుల నేఁ నేఁడం బక్కణ - - - - - ౯

గీ. గ్రామఘోషంబు పురివాడబ్రహ్మలోక, ము - - - - డు మెఱగసాల మోక్షమునకు
దూషితం బయ్యె సంసర్గదోషకలన, నంటుముట్టునఁ గలుషితంబయ్యె నాఁడు. ౧౦

క. - - - - - తనయల నిద్దఱు తనయులనుం గాంచి కాలధర్మము నొందెన్
వనజాస్య గట్టివయసునఁ, దనయుఁడు పరలోకవిధులు తల్లికిఁ జేసెన్. ౧౧

గీ. ఏమి చెప్పంగ నఱువదియేండ్లవయసు, ముసలి సుకుమారుఁ డేకాంతముఁన రమించెఁ
గూఁతులిద్దఱు బోఁడులపైఁ గురులు వ్రాలు, నంతమాత్రపుఁ జిన్నప్రాయంబు వారి.

వ. అంతం గొంతకాలంబునకు వానిదుశ్చేష్టితంబు లెఱింగి బ్రాహ్మణులు వానిని బహి
ష్కరించిరి వెట్టి యూరు వెడల నడిచి యాబాధపతితుం డైనవానిసంసర్గంబునం బుట్టినదో
షంబు బుద్ధిపూర్వకంబు గాదు కావునఁ గొంద ఱుపవసించియుఁ గొంద ఱుత్తప్త
కృచ్ఛ్రంబు లనుసరించియుఁ గొందఱు కృచ్ఛ్రాతికృచ్ఛ్రంబులు నడిపియుఁ గొందఱు
చాంద్రాయణంబు లాచరించియుఁ గొందఱు - - - - ౧౩

సీ. - - - - - - - - - - - - - శాంతశిలలకు యమదూతలకు నభిధాంతరములు
ప్రతిబింబములు కాళరాత్రియామములకుఁ బుత్రసంతానంబు భూతములకు
నశుభకర్మముల కన్వాదేశములు మానిశాపాతకరములకు సంగడీలు
కలికాలమునకు డగ్గఱిన చుట్టంబులు ధూమకేతువులకుఁ దోడునీడ
లంధకారంబులకు విందు లనఁగ గిరుల, యందు వర్తించు చెంచుల నాశ్రయించి
మనువు మనెఁ గూఁతులును దాను మహిసురుండు, కొంతకాలంబు మనములోఁ గుత్స లేక

క. ఎనుబదియేఁడులవార్ధక, మునఁ బ్రాక్తనశక్తి యుడిగి పో దాతనికిం
దినియెడిది పెద్దమాంసము, కొనియెడి దిది కల్లు మనసు క్రొవ్వెట్టుడుగున్. ౧౪

గీ. కాంచె నిద్దఱు సుతుల నక్కామినులకు, వావివర్ణంబు మాలినవద రతండు
శాస్త్రములఁ జెప్పఁబడినదోషంబు లెన్ని, యన్నియును జేసె నాతఁ డేమనఁగఁగలదు.
౧౫

వ. అంత.

క. హేమంతము శరదాగమ, సామంతము తుహినకరవిసంజ్ఞితశబరీ
సీమంతము మదనబల, శ్రీమంతము డాసె భువనసీమాంతంబై. ౧౬

మ. బలుసు ల్పండెను దొండముక్కువడియెం బ్రాసంగుఁ జే ల్పోఁకమో
కలపూఁ బాళలతావిఁ గ్రోలి షారలెం గా బేరదిగ్వాయువుల్


CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

ఫలినీవల్లిమతల్లినల్లరులపైఁ బైపై నళివ్రాతముల్
పొలసె న్మంచులు రాలె రాత్రికరిణీఫూత్కారవార్బిందువుల్. ౧౯

చ. కలమవనాళికాకణిశకంటకకోటులచేతఁ జూడ్కి కిం
పలవడిచె న్ధరిత్రి తుహినాగమవేళఁ దటాకసారణీ
సలిలము వాతెఁ బండినయజాంగలసీమము లెన్ని యన్నిటం
దల మగుసీతు పేర్మి గరుచాల్చినభానము ప్రస్ఫుటంబుగన్. ౨౦

క. కలవింకకలకలాకుల, వలభీగర్భములు సౌధవాటములు పురం
బులయందుఁ దుహినవేళలఁ, జలి గులగులకూయునట్టిచందం బొందెన్. ౨౧

క. పెనుజలి గడగడ వణఁకుచు, వనచేనత దంతవీణ వాయించెనొకో
యన మోకప్రేంకనంబుల, ననగుత్తుల మొఱసె నలిగణము విపినములన్. ౨౨

ఉ. బింబోష్ఠీకుచకుంభభారము లురఃపీఠంబులన్ హత్తి మో
దంబారం గ్మృదుకేళిశయ్యల శుభాంతర్గర్భగేహంబులం
దాంబూలీదళభాగపూరితముఖుల్ ధన్యాత్మకు ల్మీతశా
లం బెంతేనియు నిద్రవోదురు నిశల్ సంభోగలీలావధిన్. ౨౩

సీ. ధనదశుద్ధాంతకాంతాపయోధరభారసంవ్యానపల్లవస్రంసనములు
కైలాసగిరికూటకల్పద్రుమాటవీకుసుమగుచ్ఛరజోవగుంఠనములు
చంద్రభాగాసరిత్సలిలవీచీఘటాప్రేంఖోలికాకేళిరింఖణములు
రాధాపురీహర్మ్యరత్నహేమగవాక్షసంవేశనక్రియాసౌష్ఠవములు
వలనుగాఁ జంపకారణ్యవాటిఁ దఱిసి, కాశి యొరసి కళింగాంధ్రదేశసరణి
దక్షిణము సాఁగెను సపాదలక్షశైల, కటకబంధుఁ డుదగ్దిశాగంధవహుఁడు.

గీ. చలి ప్రవేశించు నాగులచవితినాఁడు, మెఱయు వేసవి రథసప్తమీదినమున
నచ్చుసీతు ప్రవేశించుఁ బెచ్చు పెరిఁగి, మార్గశిరపౌషమాసాలమధ్యవేళ. ౨౪

గీ. ఇనుఁడు కోదండరాశిమీఁ దెక్కువేళ, నిక్షుకోదండవల్లి యెక్కిడు మరుఁడు
సమదవేదండసమమహాసత్త్వుఁ డయ్యె, జనుఁడు కోదండమునుబోలెఁ దనువు వంచు.

గీ. ఇండ్లమొదలను నీరెండ నీడికలను, ననఁగుఁ దమ్ముఁడు నన్న యు నాటలాడు
నత్తయును గోడలును గుమ్ములాడుఁ గుమ్ము, గాఁచుచోటికి మకరసంక్రాన్తివేళ.

సీ. కాశిలోఁ జక్రపుష్కరిణి దుష్కరశుష్కగహనావళీదావదహనజివ్వఁ
గుక్కుటేశ్వరవరకుండి పీఠపురి శంకాతమస్కాండచండాంశుదీప్తి
దక్షవాటంబు సప్తర్షిగోదావరి కలిదోషపాషాణకులిశధార
గౌతమీతటిని మార్కండేయపురి ప్రోల్ల దురితాహిసంఘాతగరుడమూర్తి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

నిన్నిటను దీర్ఘమూఁడంగ నేఁగుదెంతు, రథిలమునులు ప్రభాతసంధ్యాగమముల
గ్రహగణేశుండు కోదండరాశిఁ బాసి, మకరమున కేఁగుదేరంగ మాఘవేళ. ౨౮

మ. పటిమోయుం దుహినంబు పండె వరి యిప్పల్పూసె శైలంబులన్
గటిగట్టె న్నృపరాజు తేఁటియెలకిం గాంచె ప్రకాండంబులం
జలపించె న్గ్రహరాజు మాతరకునిం జక్రాద్రికూటంబునం
దడఁ గౌబేరదిగంతదిక్పథయాత్రాజైత్రతుత్తుంభమున్. ౨౯

వ. వెండియుం జకోరలోచనల కుచమండలంబునకుఁ గస్తూరిఖండక్షోదంబుల మేదిం
చిన చందనానులేపనైపథ్యం బపథ్యం బయ్యె. రథ్యవేగంబున ననూరుసారథి
రథంబు ప్రతివిఘట్టనక్షుణ్ణనక్షత్రక్షోదపాళీచులుకితోర్ధ్వాండభిత్తియై యుత్తరాయ
ణంబు గైకొని కులూతశాతోదరీకపోలముకురబింబంబులం బ్రతిబింబించె. సవ్యా
పసవ్యక్రమంబునం జక్రమిథునంబుల నెట్టుకొని బిట్టేసి యేసి విసిగి నిల్చి మనో
భవుండు నిగిడించిన నిట్టూర్పునుంబోలె నిశాసమయంబుల నిండువెన్నెలలోనం
జన్నిచిన్ని నులివేఁడిననిి పొడచూపె. కేదారక్షేత్రంబులం గలమగోపిక లొడి
కంబుగా దంచిన నిద్దంబు లగుదుద్దుగడుబ్రాసంగుఁబ్రాలు సద్యోమార్జనావశం
బున నతిస్నిగ్ధవర్ణంబులై కర్ణాటదేశ తాటంకినీ దశనవప్రాంకురంబుల కాంతిసంపదఁ
దలంచె. నీహారవ్యపాయంబున నిర్మలంబులై బహుళపక్షప్రదోషంబులయందుం
దారకంబులు, వికచకుముదకోరకంబులు కొలంకులఁ గొలంకులలోనం బ్రతిబిం
బించి మదకలకలహంసత్రోటికోటీవిఖండితమృణాలదండఖండంబుల భాగంబు
భజించె. హృదయోత్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోరకాలకూటవిషమషీ
కళంకపంకచ్ఛాయాచ్ఛటాకుండు భువనరక్షాదాక్షిణ్యుండు దాక్షారామభీమేశ్వ
రుండు దక్షిణజలధివేలావలయితంబు లగు నేలాలవంగలవలీమతల్లికాకుడుంగక్రో
డంబులం గ్రీడించుటకునై సారంగలోచనలుఁ దానును గోరంగి వెడలె. వలవలని
మంచుఁ దుప్పరమునురుజడిం దడిసి జడనుపడి క్రేఁకలగు పోఁకపూఁబాళల పరిమళం
బులఁ బుక్కిలించి యుమియుచుఁ, బక్కణంబులలోన నల్లనల్లన పొలుపారు నడవి
కరువలి యసమసమవిషమకుసుమశరక్రీడామతల్లికల మల్లుపెనంగి డస్సినభిల్లపల్ల
వాధరల గల్లఫలకంబులఁ గ్రొత్త యుదయించు చెమటచిత్తడి యుడిపె. కాశీ
శ్రీశైలకుంభఘోణశోణార్కకాంచీకాంచనసభా కాళహస్తికురుక్షేత్రాదిపుణ్యసా
నంబులం గూపవాపీతటాకకుండికాప్రస్రవణస్రోతస్వినులం బ్రత్యూషకాలంబులం
బరమర్షిసార్థంబు తీర్థంబాడె నిర్విఘ్నంబున మాఘమాసవాసరంబులు వసంతసమయ
సామంతంబులు జరగుచుండ నాచండాలాదిమనుష్యులకు భుక్తిముక్తులు ప్రసా
దింపం జాలి మాహేశ్వరులకు మహోత్సవంబు పాశుపతులకుం బ్రీతి కాళాముల

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

కపలంబంబు మునులకు మనికి జటాధారుల కాధారంబు పరివ్రాట్టులకుఁ బట్టుఁ గొమ్మ వేదాంతులకు సంతోషం బాగమికులకు భాగధేయంబు మాంత్రికులకు మనువు తాంత్రికులకుఁ దానలంబు పౌరాణికులకుఁ బ్రాణం బౌపనిషదుల కుపాయంబు ముముక్షులకు రక్ష శంభునకు విస్రంభస్థానంబు శాంభవికి హృదయోత్కంఠయు హేరంబునకుఁ బ్రియంబు తండ్రువునకుఁ బండువు కుమారస్వామికిం బ్రేమాస్పదంబు భృంగిరిటికిం దంగెటిజున్ను దురితతరుషండఖండనంబునకు గండగొడ్డలి యఘపటలతిమిరసముదాయాహిమఘృణిసంతానంబు సంతాపశాంతికి భాగీరథీప్రవాహంబు శివరాత్రిపుణ్యకాలం బేతెంచిన. ౩౦

సీ. ఆవణిక్పదమున కనతిదూరంబున గప్స్ర్యాతియెడ నుదక్పశ్చిమమునఁ
బర్వతోపత్యకాపర్యంతతటమున సికతాతినిర్మలక్షేత్రసీమ
మాలూరతరుషండమధ్యభాగంబునం బ్రస్రవణాపగాపార్శ్వభూమిఁ
గుసుమవాటికలలోఁ గువలయాంభోరుహకుముదమండితమైన కొలనితోడఁ
గోటతో గోపురములతోఁ గుట్టిమాట్ట, మండపంబులతో మహామహిమనొప్పు
నాదిమధ్యంబునాగేశ మనఁగ నొక్క, పుణ్యతీర్థంబు త్రైలోక్యపూజితంబు. 3౧

గీ. అందు శేషప్రతిష్ఠితుం డమృతడిన్య, లింగమంగళమూర్తి ఖట్వాంగపాణి
యర్ధశశిమౌళి నాగేశ్వరాహ్వయుండు, ప్రతివసించు ననేకకల్పములనుండి. 3౨

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబున. 33

సీ. శివగంగఁ బుణ్యాభిషేకంబు దీర్చిరి దరి నొనర్చిరి మూఁడుతగ్పుణములు
ధరియించి రంబునిర్ధౌతవస్త్రంబుల నాచరించిరి బ్రహ్మయజ్ఞతంత్ర
మర్ఘ్యాంజలిక్షేపణానంతరమ్మునం దొనరించి రంశుమంతాన కుపాస్తి
గృహదేవతార్చనక్రియ లాచరించిరి యభ్యాగతులకు నర్హణాలు నడిపి
రవనిసురులెల్ల నాగేశ్వరాలయమున, కేగుదెంచిరి ప్రణమిల్లి రీశ్వరునకు
- - - - - - - - నాల్గుజాలుఁ బూజ, నాదిసంకల్పమొనరించి రభవుమ్రోల. 3౪

గీ. ఆదరంబున సమ్మార్జనాను లేప, ధూపపటువాసనలు తైలదీపములును
సంఘటించిరి వివిధసంస్కారవిధుల, బ్రాహ్మణులు నప్పలైనట్టి పౌరజనులు. 3౫

సీ. కాంస్యతోరణమాలికలు సంఘటించిరి ప్రాసాదగోపురాభ్యంతరముల
రంభాతరుస్తంభసంభారములు సముత్పాటించి రొగిఁ బ్రతిద్వారమునను
బూజోపకరణపాత్రీజాత మఖిలంబు సంస్కరించిరి భస్మసలిలశుద్ధిఁ
గరమొప్ప వృషభపుంగవకేతనంబులు నిలువంగఁ బెట్టిరి వలభులందుఁ
గమలనీలోత్పలంబులుఁ గర్ణికార, మాలతీకుందములు హేమమరువకములు
మల్లికాకింశుకము లపామార్గవకుళ, పాటలంబులుఁ గూర్చి రపారములుగ. 3౬

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

గీ. అపుడు సుకుమారకాహ్వయుం డదరునజ్జ, నేగుదెంచెను నాగేశ్వరేశుగుడికిఁ
బుష్పవాటికలోఁగమ్మపువులఁగోసి, పాలఁతులకునిద్దఱకుఁగొంచుఁబోవఁదలఁచి. ౩౭

క. కుడిచేతమాంసఖండము, లెడకేలను మద్యరససహితమగు కంచుం
గుడుకయు ధరించి మదమున, వడవణఁకులు గొనుచు నతఁడు వచ్చె న్గుడికిన్. ౩౮

వ. జన్మాంతరస్థుండువోలె రూపాంతరగతుండువోలె నావిష్టుండువోలె భూతాధిష్ఠి
తుండువోలె గ్రహగృహీతుండువోలె నున్మత్తుండునుంబోలె మదిరామదాతిరేకం
బునఁ దన్నుఁ దా నెఱుంగక పరిసరలతాకంటకానుషజ్యమానాంశుకోత్తరీయుం
డును నజ్ఞాతసమవిషమమేదినీభాగవిన్యాసప్రస్ఖలితపాదద్వయుండునునై పలితపాండు
రంబు లగుశిరోరుహంబులు విరిసి వీఁపునం బడ నొయ్యనొయ్యన నేతెంచి
నిర్లజ్జుండును నిస్స్నేహుండు నృశంసుండును నగునక్కర్మచండాలుండు గర్భగోళం
బునకుఁ జక్కం గట్టెదుర నిలిచి రక్తకమలదళచ్ఛాయంబు లగుకన్నులు దెఱచి
విఘూర్ణమానతారకం బైన వికారాలోకనంబున నవలోకయుంబోలె నిర్మలస్ఫటిక
మండపాధ్యాసీనుండును సమ్మృతమయజ్యోతిర్లింగమూర్తియు ముక్తాఫలధవళకాం
తియుఁ ద్రిభువనవందితచరణుండును జరాచరగురుండును నగునాగేశ్వరుని దర్శించి
యమ్మహాదేవు మౌళికపాలమాలికామండనఖండేందుశకలంబులకు గగనగంగా
ప్రవాహ డిండీరఖండంబులకు నుష్ణీషఫణిఫణా ఫలకంబులకుఁ జెలికారంబు
సేయంజాలి పాంచజన్యసహోదరంబు లన దుగ్ధాంబురాశి హృదయంబు లనఁ
జంద్రికాశరణంబు లన నంగజాట్టహాసంబు ఫేనంబు లన మెండుకొని యున్న ౩౯
పుండరీకంబుల పూజగనుంగొని వెండియు.

ఉ. చాయన భోగిరాట్కటకసన్నిధిదీపితదీపమాలికా
చ్ఛాయఁ బురఃప్రదేశమునఁ జాఁగిన నిర్ఝరవాహినీమహా
తోయముసావి చీరయెగఁద్రోచి చొరంగఁ దలంచె నెంతలోఁ ౪౦
దోయని కొంకి కొంకి పతితుం డతఁ డాసవపానవిక్రియన్.

గీ. పవనవశమునఁ గేతకీప్రసవధూళి, యంగమున హత్తియుండంగ నాతఁ డపుడు
విమలభస్మసముద్ధూళన మొనరించి, పాశుపతదీక్షఁ గైకొన్నభంగి నుండె. ౪౧

చ. కలఁగఁగఁబాఱె నాతని యఘంబులు పంచహృషీకసంభవం
బులు బహుకాలసంకలితము ల్దవవహ్ని చిటచ్ఛిటధ్వనిం
గలఁగఁగఁబాఱు పత్తులప్రకారమునం దొలుజాముపూజకై
బలుపటహమ్ము ల్మ్రోయుచు భర్గుని గేహమునందు మ్రోసినన్. ౪౨

వ. ఆశివరాత్రిపుణ్యకాలంబునఁ బురాణంబులు వినిపించువారును నితిహాసంబులు
చదువువారును బంచాక్షరీపంచబ్రహ్మాదిమంత్రంబులు జపించువారును నీలకంఠ

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

స్తోత్రంబులు పఠించువారును ప్రాణాయామంబు లనుసంధించువారును ప్రత్యాహారంబులు నడుపువారును ప్రదక్షిణంబులు సేయువారును భస్మోద్ధూళనంబు లొనర్చువారును దుహోదరంబుల వినోదించువారును నష్టావధానంబులఁ గ్రీడించువారును వీణలాస్ఫాలించువారును గాన్యగోష్ఠి సలుపువారును బరిహాసం బాదరించువారును బిందుమతి యభ్యసించువారును బ్రహేళికలు భావించువారును నాడువారునుం బాడువారును మేషకుక్కుటకరేటులావుకకపింజలయుద్ధంబులు వీక్షించువారును గుబ్జవామనకిరాతబర్బరజరఠమూకజనవికారంబు లనలోకించువారు నై జాగరంబులు సలుపుచునుండిరి సుకుమారుండును నొక్కించుక యన్నుం దేఱికొని వారిం జూచుచుండె నప్పుడు శివగంగానిర్ఝరజలతరంగశీకరజాలజనితజడిమంబులు నందిరోమంథఫేనబిందువాహులుం గుమారశిఖికలాపవిధూననక్రియాలలితంబులుఁ బశుపతిజటాబద్ధవాసుకినిపీతశేషంబులు హేరంబగండమండలనిష్యందమానదానధారాకలుషగంధలహరీపాంధమంబులు భృంగిరిటిసికుంభకుంభోదరప్రముఖనిఖిలగణపరిష దుద్ధూళితభసితధూళికావిసరంబులు మాతృకాశ్రనణాపతంసకహ్లారకోరకప్రేంఖోళనప్రక్రియాసమభిహారానుమేయాపతరణంబులు మహిసాక్షిగుగ్గులుధూపధూమకంబులు మాలూరకిసలయామోదమేదురంబులు నగు మహాదేవనిశామారుతంబు లతనిమీఁదఁ బొలుపారి పాతకంబులు దూలరాల్చె నట్టిసమయంబున. ౫౩

గీ. అర్ధరాత్రంబుదాఁక నయ్యధమవృత్తి, శివుని శానైభవంబు వీక్షించి చనియెఁ
దానకమునకు నది మొదిగా నతండు, విడిచెఁ దొల్లింటి నీచపువృత్తిబుద్ధి. ౫౫

వ. అంతఁ గొంతకాలంబునకు. ౫౬

క. కుక్కలలో శబరులలోఁ, గక్కెర చిమ్మటలలోనఁ గార్కొలుసులలోఁ
బక్కణముగుడిసె నడుమను, గుక్షిపయిం జచ్చె నతఁడు ఘోరవ్యాధిన్. ౫౭

క. శ్రీనాగేశ్వరశంభు, స్థానంబున గిరిశురాత్రి జాగరములు - - -
- - - ననుగనుఁగొన్నట్టిక, తానను విగతాఘుఁడై యతఁడు మృతిఁ బొందెన్. ౫౮

సీ. క్రిమి కంఠకుహరమార్గమున కడ్డము దొట్టి పెద్దయేనియు బాధపెట్టకుండ
శ్లేష్మ ముద్రేకించి సెలవి రంధ్రమువాయ మెఱసి నుచ్చిల్లు గ్రమ్మింపకుండ
దృగ్గోళకంబులు దిసుగంగ దృష్టియు నంధకారంబులో నణఁగకుండ
నెఱవప్పి యుచ్ఛ్వాసనిశ్వాసపసమానపరివాహగతు లోటువడకయుండఁ
బరమయోగీశ్వరుఁడువోలె బ్రహ్మరంధ్ర, వీథిఁ బ్రాణంబువిడిచెనవ్విప్రకులుఁడు
పుణ్యశివరాత్రిసలవోకవోలె నైన, నురగధరుచెంత జాగరం బుండెఁగాన. ౫౯

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వ. ఆకాలంబునఁ గాలకింకరులు మృత్యుదేవతాసహితులై ముసలముద్గరతోమరాది
ప్రహారణంబులతో - - - - - అతనిలింగశరీరంబు వరుణపాశంబుల బంధించికొని
పోవఁ గణంగిన నవ్వేళ శివదూతలు శివాజ్ఞానశంబున శూలాంకుశగదాభిందిపాల
పరిఘుపరశ్వధ - - - - - - - - -చ్చి దవ్వుల నాకాశమార్గంబున. ౪౯

గీ. ఓరి యమునిదూతలార యీబ్రాహ్మణుఁ, గరుణ మాలి యేల కట్టినారు
విడుఁడు శివునియాన మృడునాజ్ఞదాఁటమీ, రాజు - - - - - గ్గరామదించి. ౫౦

మాలిని. విడుఁడు విడుఁడు వీనిఁ (విప్రునిఁ) భాగ్యవంతుఁ
మృడుఁడు గరుణతోడ న్నిక్కిలిం గారవించెఁ
జడుల కొరుల కేలా సంభవించుఁ యథార్థం
బడర మఱిమ్మ - - - - - - ప్పలసంబుల్. ౫౧

గీ. అన్నదాన తపస్స్వానృతాదులైన, పుణ్యకర్మం బొనర్చిన పురుషునందు
నెట్లు సంతోషమందు నర్ధేందుమౌళి, యట్టిసంతోష మితనియం దావహించె. ౫౨

౫౩
వ. అనిన యమకింకరులు శంకరకింకరుల కిట్లనిరి.

సీ. ఏకార్యమునకయి యెచ్చోటి కరిగెద రరుగుఁడు మీరు మహాత్ములార
యితని క్లేశము చూచి యతికృపాపరతమై పు - - - - - రింపఁ బూనినారె
హరుకింకరుల మన్న నాశ్చర్య మయ్యెడు సదసద్వివేకంబు చాలకునికి
భవభక్తులకు నడ్డపడుట ధర్మము మీకు నేమేని పట్టుదు మీశుభక్తు
నితఁడు కలుద్రాగెఱంకాడె నెఱచిఁదినియె,నిలిచిమూత్రించెఁ జండాలలసనఁగూడెఁ
గూఁతురమియించెఁ దెరువాటుగొట్టెఁ బ్రజలఁ, జెంచు రాజుల సేవించెఁ జెఱిచెఁ గులము.

సీ. కేలుదో యెత్తి మ్రొక్కెనె పాశుపతులకు శరణార్థి ననియెనే జంగములకు
ఫాలభాగమునందు భస్మంబు పూసెనే యఱుతఁ దాలిచెనె రుద్రాక్షపూస
శివమంత్ర ముచ్చరించెనె జిహ్వ నేప్రొద్దు నరిగెనే యెన్నఁడే నభవుగుడికిఁ
బరియించెనే మహాప్రమథచారిత్రంబు తిరిగెనే మృడుపుణ్యతీర్థములకు
దానములు పెక్కుఁ జేసినదానఁగాని, కాలగళుభక్తియావంతఁ గలిగెనేని
యడ్డపడ ధర్మమౌఁగాక యనఘులార, యర్హమే యీదురాత్మున కడ్డపడఁగ. ౫౫

ఉ. ఎట్టుగ నేగుదెంచితిరి యిందుకళాధరభృత్యులార యీ
చెట్ట దురాత్ముని న్హగునిచెంతకునుం గొనిపోవువారలై
యెట్టొకో శంకరుం డొకని నెవ్వని నేఁ గొని తేరఁ బంపినం ౫౬
బట్టఁగవచ్చినారొ తడఁబాటున వీని మతిభ్రమంబునన్.

సీ. అనిహేతువులును దృష్టాంతంబులును జూపి యమ - - - - యవనిసురుని
నూరకయుండె మృత్యువు నోర్గదల్పక భవునిచే మును పక్షపాటుఁ దలఁచి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వరుణపాశములచే వ్యథితచేతస్కుఁడై సుకుమారుఁ డెంతేని స్రుక్కుచుండ
నెదురుచూడఁ దొణంగి రీశ....... తారు పంచినవారు తడయుటయును
గాలయాపనమునకు నిగ్రహముఁబూని, శంభుకింకరు లపు డసప్టంభ మెసఁగ
నొడుగఱచుచు నప్పుడేకాంతముండి, సమధికం బైనసాహసోత్సాహస్ఫూర్తి. ౫౭

ఉ. బిత్తరి దండిమాట లిటు ప్రేలెదరే యమరాజసేవకుల్
చిత్తజవైరియాజ్ఞ యొకచీఁకికిఁ గైకొన కంచు నుద్ధతి
న్మిత్తిని వారినిం గదిసి నిర్భరభూరిభుజాబలంబునన్
మొత్తిరి యుక్కు బాహువులు మోడిచి పట్టి నృపాంకకింకరుల్. ౫౮

క. కడనసములఁ బ్రహరించిరి, యడిచిరి లాతముల మొత్తి రహినలయములం
బిడికిళ్లను ఘట్టించిరి, తడఁబడ మృడుఁభటులు దండధరుకింకరులన్. ౫౯

వ. ఇట్లు మొత్తునడి యమకింకరులు శంకరకింకరులకుం బ్రతిఘటింపక సుకుమారుని
బరివేష్టించి యమలోకంబున కభిముఖులై యతనిం గొనిపోవం దొణంగి రప్పుడు
రుద్రాక్షమాలికావక్షఃస్థలుండును జంద్రార్ధకృతశేఖరుండును భస్మోద్ధూళితలాలి
తాంగుండును ద్రిలోచనుండును నతిప్రమాణకాయుండును నగునీలలోహిత
ప్రముఖుండు కాలాంబుదధ్వానగంభీరం బైనకంఠస్వరంబున ని ట్లనియె. ౬౦

సీ. వడసె నెవ్వనికృప బ్రహ్మ బ్రహ్మత్వంబు విష్ణుండు విష్ణుత్వవిభ్రమంబు
నీరేడుజగములు నెవ్వనికుక్షిలో నొక్కఁ డొక్కంటితో నొరయుచుండు
నంధకేభజలంధరాదిదానవకోటిఁ గ్రాఁగించె నెవ్వానికంటిమంట
యామ్నాయశాఖాసహస్రంబు లెవ్వని నాసికారంధ్రనిశ్వాసధార
లమ్మహాదేవు లెంకల మైనమేము, భర్తయానతి నిర్వహింపంగఁ దలఁప
మమ్ముఁ జీరికిఁ గైకొక మదము పేర్మి, నెట్టుకొనిపోయెదరు విప్రు నెఱయఁగట్టి. ౬౧

ఉ. బుద్ధియ కల్గ నేని కొనిపోకుఁడు ధర్మము సూక్ష్మ మీయసం
బద్ధము లైనన్యాయములఁ బంతము వచ్చునె మేము దెంపుమై
యుద్ధము సేయఁజాలకయ యోహరిసాహరి నెంతచెప్పిన
న్నిద్ధరణీతలామరుని నీరు చలంబున మీకుఁ దక్కునే. ౬౨

గీ. ఎంత చెప్పిన విన రేమి యీకుమాకు,హరునియాజ్ఞయ బలవంత మల్ప మెట్టు
చాక నొవ్వక మీరు మాకాఁకఁజెడక, యిద్ధరామరుమాకిప్పుడిచ్చుటొప్పు. ౬౩

క. నావుడును యమునిదూతలు, భావభవారాతిప్రమథవర్గముతోడన్
సేవకధర్మము తగవును, లావును బంతంబు దృఢబలంబును మెఱయన్. ౬౪

వ. ఇట్లని పలికిరి. ౬౫

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

క. చత్తుము చెఱఁబడుదుము కడు,నొత్తుము మీచేత నెట్టునుం దగవు మముం
బుత్తెంచినపతిసన్నిధి, నుత్తర మెట్లిత్తు మాజ్ఞ యుపహతిఁబొందన్. ౬౬

సీ. చర్చించి చూడుఁడా చంద్రార్ధమౌళికి యమరాజు నిజభృత్యుఁడౌనొ కాఁడొ
యభవుఁ డిచ్చినయట్టియధికారమౌఁగాదొ యముఁడుగూర్చున్నధర్మాసనంబు
త్రిపురాసురాంతకుదివ్యదేహము గాదొ వేదస్మృతులు తత్త్వవిధిఁ దలంప
శిష్టరక్షయు దుష్టశిక్షయు శూలికి - - - - - - - - - దొ యాత్మలోన
నవకరము లెన్ని యన్నియు నాచరించెఁ, బాపియగువానినరకకూపమునఁ ద్రోచి
బాధపెట్టంగవలసినపట్టునందుఁ, బంతమే విడఁ డంత యోప్రమథులార. ౬౭

ఉ. చచ్చిన నేమి మూర్ఛ - - - - - - నేమి ప్రహారవేదన
న్నొచ్చిన నేమి పండ్లు చెవి నోరు కరాంగుళనేత్రగోళముల్
ముచ్చిన నేమి పట్టపలి మొక్కలిబంధనశాలలోనికి
న్వచ్చిన నేమి భృత్యునకు నచ్చినయేలికయాజ్ఞపట్టునన్. ౬౮

గీ. తగవు ధర్మంబు పాడి పంతంబు దెలిసి, యనుపుఁ డీబ్రాహ్మణుని బాధ లనుభవింప
నొండె దురమున మమ్ముమృత్యువుజయించి, విప్రుఁగొనిపొండు మాటలు వేయు నేల.

క. మీకును మీపతియానతి, మాకును మాభర్తయాజ్ఞ మన్నింపఁదగున్ .
(?)వాకావవాక్యముల వెడ, వాకాట్లం బల్బజంబు వలవదు సేయన్. ౭౦

క. అని యమునిభటులు పలికిన, విని శంకరభటులు తద్వివేకంబునకున్ .
మనమున సంతోషించియు, మనసిజహరుశాసనమును మన్నించుటకై. ౭౧

సీ. పాడికచ్ఛడములపైఁ బులితోలునను సేలు కటిభాగమునఁ గాసెకట్టు గట్టి
యభినవం బైనరుద్రాక్షయొడ్డాణంబు నాభిచక్రములోనుగా భరించి
ప్రిదిలి జాఱక యుండఁ బెనుఁబాఁపఱ్ఱోఁగులు శ్రవణభాగమునందు సంతరించి
యల్లిబిల్లిగ జటానల్లీమతల్లులు గూర్చి పెంపొందఁ గీల్కొల్పు వెట్టి
భసితధూళి శరీర మభ్యంగమార్చి,యుద్దవిడిఁ బారిషదయోధు లొక్కఁడొకఁడ
యాయుధంబులు ధరియించి యట్టహాస, డమరుకధ్వానసింహనాదములతోడ. ౭౨

శా. ఆటోపారభటీసముద్భటతరాహంకారబాహాధను
ర్జ్యాటంకారరవంబు లంబుజభవాండాభ్యంతరంబుల్ సమా
స్ఫోటింపంగ లలాటలోచనభుజిష్యు ల్దండభృద్భృత్యులన్
ఘాటీసంభ్రమలీలఁ దాఁకిరి పడిన్ ధారాధరాధ్వంబునన్. ౭౩

సీ. ద్రాఘిష్ఠకఠినదంష్ట్రాదంశసంఘట్టకటుఘోరకిటకిటాత్కార మగుచుఁ
జటులఝుంఝామరుజ్ఝంపాపరంపరాసన్నిభఘ్రాణనిశ్వాస మగుచు



CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

వికలతారకచక్రవిభ్రాన్తిభీషణస్ఫారచతుర్దశభుజాభయద మగుచు
నిటలవీథివిటంకనిష్ఠురభ్రూకుటీనటనక్రియాటోపపటిమ మగుచుఁ
గాలమృత్యువు శాణచక్రమునఁబట్టి, చికిలిచేసిన యడిదంబుఁ జేతఁ దాల్చి
జేగురించిన మొగముతోఁ జిత్తజారి, ప్రమథవర్గంబుఁ దాఁకె నాగ్రహమెలర్ప. ౭౪

వ. - - తననేత మదవృతనుతమనినదముతవణించుచుఁ దచ్చటులతమాఖీాత డంబర విష్కంభము కాష్ఠాకటాహములు నుద్ఘాటింప దినకరంకరచ్ఛాయాచ్ఛేదాధిగమమున ధగద్ధగితము లగునిస్త్రింశకుఠారాద్యాయుధదీప్తులు రణలక్ష్మి నివాళింపంగ సపుడు విద్యాధరపన్నగయక్షగరుడగంధర్వాదులు మది నాహ్లాదింపంగ సురముని కుంచె యాశింపంగ సలింపా - - - పథంబున భవునిలెంకలు శమనకింకరులును బాహాస్తంభవిజృంభణ మప్రతిహతముగ నొండొరువులఁ దాఁకిన భండనంబు ఘోరంబయ్యెను. ౭౫

క. శంకరభటులును నంతక, కింకరులు మిథఃప్రహారకీలాలసటా
పంకిలతను లయి కుసుమిత, కంకేళీతరులభంగిఁ గనుపట్టి రనిన్. ౭౬

వ. అప్పుడు కింకరులయం దొక్కరుండు యమునిసన్నిధికిం జని యతని కిట్లనియె. ౭౭

సీ. దేవ దేవరయాజ్ఞ ధృతి నేము దలఁబూని మృత్యుతోఁ గూడి భూమిస్థలమునఁ
జని వఙ్కిపథ మనుఘనపట్టనమునకు ననతిదూరమున శైలాంతరమున
నడవిలో నొకమృగవ్యాధపక్కణమునఁ గుష్ఠామయంబునఁ గుతిలపడఁగఁ
జెడి పెక్కుఁతురు కాళ్లకడనుండి యేడ్వంగఁ బంచత్వ మొందిన పాపకర్ము
బ్రహ్మబంధుని సుకుమారుఁ బట్టి తేఁగ, నభవుమానిసులు రానీకయాఁగినారు
మాకు వారికి దుర మయ్యె నాకసమున, నెఱుఁగఁజెప్పంగ వచ్చితి నిత్తెఱంగు ౭౮

వ. అనిన విని కృతాంతుండు సమధికక్రోధావేశవివశస్వాంతుండై యులుంబరుం డను సేనాని రావించి యతనితో ని ట్లనియె. ౭౯

గీ. చనుములుంబరవృషభలాంఛనుని లెంక, లాఁగినా రంటమునవాంద్ర నాకసమున
నొక్కపాపాత్ముఁ గొనిరాఁగ నుద్దవిడిని, నేగి యాజటాధారుల నెగిచి రమ్ము. ౮౦

క. గబ్బున నెదిరించిన నొక, దెబ్బగొనుచు - - - నెదురెత్రిగజముల నొరుల్
తబ్బిబ్బుగ జంగములకుఁ, బబ్బంబులు వెట్టు ముష్టిపరిఘట్టనలన్. ౮౧

గీ. వ్యాధులష్టోత్తరశతంబు వచ్చుఁగాక, తోడనే తెంచుఁగాక మృత్యువులునూఱు
పంపినారముమున్నాడిభటులఁ గూర్చి, కాలమృత్యువు గెల్చు శంకరునిహితుల. ౮౨

వ. అని పల్కిన వల్లె యని యులుంబరుండు వివిధవ్యాధిమృత్యుపరివృతుండై కదలి యుద్దవిడిఁ దూర్యంబులు మొరయఁ బ్రమథానీకంబుఁ దాఁకి శస్త్రజాలంబు నిగిడ్చి పేర్చి యార్చినం గోపించి పంచవదనభటులు కుటిలభ్రూభంగభీషణంబు లగు

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

మొగంబులు జేవుఱింప నట్టహాసంబు చేసి యదల్చి డమరుడిండిమ ఢమఢమధ్వానంబుతోఁ గీనాశకింకరుల ముసలభిందిపాలతోమరమండలాగ్రత్రిశూలపట్టసంబులఁ బ్రహరించిన విచ్ఛిన్నబాహూరుచరణవక్షః - - - - లలాటకృకాటులై విచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ దెరలియుఁ బొరలియుఁ దోఁగియు డాఁగియుఁ గ్రుస్సియు డస్సియుఁ గందియుఁ గుందియుఁ దారియు - - మ్రొగ్గియుఁ దగ్గియు నలసియు సొలసియు వికావికలై దిక్కుమొగంబులై యారుసారులై గురియై బందబంద్రై భండనంబు విడిచి వలయ- - బారి వెలవెలంబోయికృతాంతునిసన్నిధికిం బోయిరి. ఇట జటాధారులు సుకుమారుని బంధనంబు లూడ్చియు నతని మున్నిడుకొని హాహాన్నాళంపుఁగరామారి చాయలం బంటించు మింటితెరువునం జనిరి. అప్పు డాసుకుమారుండు పుణ్యశివరాత్రివ్రతాలోకనప్రభావంబున. ౮౩

తాళవృత్తము. (?)దావపులం గాంచెం గైలాసముతదుణేందు(కళా)ధరునినివాసము
దళహరి స్థానస్థపుటితధవళచ్ఛాయాచ్ఛేదవిలాసము
ధ్రువమండల- - -సంతాధస్థూలశృంగశృంగాటకవిహం
త్ఖచంగరుడగంధర్వప్రమదాస్తోమవిహితలీలాపరిహాసము
నవలేపాటోపసముద్భటవిఘ్నాధిపదీర్ఘవిషాణప్రఘుణ
వ్యాఘట్టనపారద- - -మయప్రస్థతటధ్వనివిసరము
నవిహితరూపాముద్రానిగదవ్యాఖ్యాతాశోకలతాపల్లవ
యాథాతవ్యయవిజిత్వనీహారాద్రిసుతాచరణన్యాసము. ౮౪

సీ. కామధుగ్ధేనుసం - - - - తొట్టులుగాంచెఁ (?) గాంచన నవరత్నకందరములు
కాంచెఁ గల్పకవాటికాసహస్రంబులు, సిద్ధరసాపగాశ్రేణిఁ గాంచె
బహుహిరణ్మయమహాప్రాకారములు గాంచె, నమరిన - - - - ధములుగాంచెఁ
బ్రబలచింతామణీస్పర్శవేధులఁగాంచె నానావిమానరత్నములు గాంచె
హావభావవిలాసరేఖావిశేష, హారిమూర్తుల రుద్రకన్యకలఁ గాంచె
(మనసుత)నివోవనర్ధేందుమౌళిఁగాంచె, గాంచె సుకుమారుఁడంబికాకాంతుశివుని.

వ. కాంచి దండప్రణామంబులు చేసి చేతులు మోడ్చి నమశ్శంకరాయ, శశాంకమూర్ధాలంకారాయ, త్రిభువన (?) పురంధ్రీనీరంధ్రస్తనకుంభసముత్తంభితకస్తూరికాస్థాసకముద్రాద్రోహిబాహార్గళస్తంభాయ, జంభారిప్రముఖనిఖలదేవతాకోటి హాటకకిరీటకోటీవిటంకసంవాసితమందారమాలికామరందబిందునిష్యందధారాధౌతచరణారవిందాయ, జలంధరాసురకంధరా పీఠికా విఘట్టనక్రియాగరిష్ఠనిష్ఠురతా శశ్వద్విభంగఖట్వాంగపాణయే, పశ్యల్లలాటాయ, మదనమదగదాగదంకారాయ, సంధ్యానటాయ, కరకలితడమరుఠాంకార బృంహితబ్రహ్మాండమండలాయ, చండికాధి

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri

పతయే, నిస్తులసూత్రపాధకాయ, సచ్చిదానందస్వరూపాయ, స్వమహామహిమప్రతి ష్ఠాయ,నిరుపాధికనిరవద్యకల్యాణగుణనిరంతరానిరుపాధిసంధినిర్భరకృపాసంపత్సంపూర్ణమ ధసే, నృపాంకమాలికాభరణాయ, సముద్దండతుండరీకత్రయ్యాదశ్శ్రీకంఠాభరం భరస్కంధభాగాయ, భగవతే భర్గాయాఽస్తు! కృతపుణ్యాయాఽస్తు!! నమస్తే నమస్తే. అని పలికి వెండియు. ౭౬

విషమవృత్తము. (*) జయజయశంకరజయజయపురహర
జయజయ- - - - - -గుణాకరుణాలయ
జయజయతుహినశైలధరకన్యాసహచర
జయజయశాశ్వతవరశుభకేతన
జయజయమందరకందరకంధర
సంక్షుభితమహాక్షీరోదవ్యజ్జకరక్రూరశజలవ
గిరీశా సకల్మాషిశితికంధరా? ౭౭

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన సుకుమారుమీఁదఁ గరుణాకటాక్షవీక్ష ణంబు లోలయించుచు విహూపాక్షుం డతనికిఁ గామగమనంబును హేమకింకిణీ మాలికాసనాథంబును రుద్రకన్యాసహస్రసంకులంబును నగుదివ్యవిమానంబొసంగి ప్రమథత్వంబు కృపచేసెఁ బుణ్యవంతుల భాగ్యంబునకుం గొలఁది గలదె, యింక నెయ్యది (వినవలతు) రనుగుండని సూతుండు నైమిశారణ్యనివాసులగుమహామును లకు సవినయంబును సస్నేహంబును సగౌరవంబునుగా విన్నవించిన. ౭౮

గీ. పరమమునులునూత్యాహసంభవునిసూతు, భక్తిఁ బూజించి యధికతాత్పర్యగరిమ భటులుప్రమథులచేభంగపడుటచూచి, చిన్నఁబోయి యముండేమిచేసెఁ బిదప.

మ. కరుణాసాగర శైవశాస్త్రకలనాగాంభీర్యశౌర్యోన్నతా
తరుణీమన్మథ రాజపూజితకళాధర్మక్రియాసంస్తుతా
పరసేతిప్రతిభావిశేషకలనా వాగీశసంకాశశ్రీ
తరుణీనాథమనోజ్ఞహావవిలసత్కావ్యార్థసంబోధనా. ౮౦

క. ధర్మార్థాలయపరగుణ, నిర్మాణవిశేషవిభవనిరుపమకార్యా
కర్మోత్కటబహుగుణవృత, నిర్మలసుజ్ఞానచతురనిశ్చలధైర్యా. ౮౧

మాలిని. శతధృతిధృతదీపాసారసిర్మాణరూపా, సతతసుఖవినోదాసామగానప్రమోదా
వితతకవివరేణ్యావీరశైవాగ్రగణ్యా, యతులఫలవివేకాహార్షనైర్మల్యపాకా.

గద్యము. ఇదిశ్రీమత్కమలనాథపౌత్ర మారయామాత్యపుత్ర సకల విద్యాసనాథ శ్రీ నాథనామధేయప్రణీతం బైనశివరాత్రిమాహాత్మ్యంబునందుఁ జతుర్థాశ్వా సము.

SRI JAGADGURU VISHWARADHYA JNANA SIMHASAN JNANAMANDIR LIBRARY Jangamwadi Math, VARANASI, Acc. No.
CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri
3863 5420

# చక్కనియాంధ్ర గ్రంథములు.

---

## విప్రనారాయణచరిత్రము.

చెదలువాడ మల్లయకవి. వెల, రూ. ౦-౮-౦

## కవిజనాశ్రయము.

వేములవాడ భీమకవి. వెల, రూ. ౦-౧౦-౦

## చంపూరామాయణము.

ఋగ్వేదికవి వేంకటాచలపతికవి. వెల, రూ. ౧-౨-౦

## చంద్రభానుచరిత్రము.

తరిగొప్పుల మల్లనకవి. వెల, రూ. ౧-౦-౦

## శివతత్త్వసారము.

మల్లికార్జున పండితారాధ్యులు. వెల, రూ. ౦-౧౨-౦

## కావ్యాలంకారచూడామణి.

విన్నకోట పెద్దయకవిప్రణీతము వెల, రూ. ౦-౮-౦

## జైమినిభారతము—వచనము.

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు. వెల, రూ. ౦-౧౨-౦

ఆంధ్రసాహిత్యపరిషత్తు—కార్యదర్శులు,

చెన్నపురము.

CC-0. Jangamwadi Math Collection. Digitized by eGangotri